# కొండుభట్టీయము
# బిల్హణీయము

(నాటక సంపుటి)

గురజాడ అప్పారావు

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ.

# అవతారిక



నాటకరచన కావ్యకళకు శిఖరంవంటిది. అట్టి నాటకరచనపట్ల ప్రత్యేక విశిష్ట సిద్ధాంతములుగల మహాకవి గురజాడ. అట్టి సిద్ధాంతములను కన్యాశుల్కపీఠికలోనూ, డైరీలలోనూ, లేఖలలోనూ చూడగలము: "కవితావ్యాసంగం నిన్న మొన్నటిలాగ యిప్పుడు లేదు. మానవజీవితాన్ని నేను చిత్రించే కళతో అనుసంధానం చేస్తాననుకో. కవితాకళకు నేను లొంగిపోవదలచిన వాడనే వినా, నాకు మానవసమాజంపట్ల మహత్తరగాఢాభ్యాస ఆసేటి వాంఛ వున్నది" అని శ్రీ ఒంగోలు మునిసుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖలోని వాక్యాలూ, "ఇక నాటక యితివృత్తంగురించి: ప్రపంచ ప్రసిద్ధ కవులైన ప్రాచీన శృంగార గాథలనుంచి యితివృత్తాలను సేకరించుకుని రచయితలు ఎందుకు నాటకాలను రచిస్తారో నాకాశ్చర్యంగావుంది. జీవితంలో ఎంత వైవిధ్యముంది! ఎంత తీవ్రసమరంవుంది! నేటి జీవితం పుష్కలమైన, అనంతమైన గాథలతో నిండివుంది. అయితే దీనిని రచయితలు దర్శించరు. ఇది గొప్పలోపమని భావించి నిత్యజీవితంనుంచి వొకవస్తువును తీసుకొని దానిని చిత్తశుద్ధితో తీర్చిదిద్ద ప్రయత్నించాను. ప్రజలు మాటలాడుకునే తీరుతీయని భాష. దీనికి తగివుంటుందికదా అని దానినే గ్రహిస్తున్నాను" అని విజయనగరం గాజాసాహెబ్‌కు వ్రాసిన లేఖలోని సంగతులు గమనించినట్లయితే, మహాకవి నాటకరచనా ప్రయోజనం కొంతవరకు విదితమవుతుంది.

ఆంధ్రప్రజలు కళ్లకద్దుకుంటున్న గురజాడ రచించిన నాటకములు మూడు: కన్యాశుల్కము, కొండుభట్టీయము, బిల్హణీయము. ఇందులో చివరి రెండునాటకములను, అముద్రితభాగములను చేర్చి ఒక సంపుటిగా అచ్చొత్తించి ఆంధ్ర సాహిత్యాభిమానులకూ, ప్రజలకూ అందిస్తున్నాము. ఇవి అసంపూర్ణ రచనలు. సామాజిక ఇతివృత్తమును స్వీకరించి మలచిన నాటకము కొండుభట్టీయము. బిల్హణీయము ప్రాచీన శృంగార కథాసంబంధి.

ఇవికాక మరికొన్ని నాటకములను వెలయించవలెనని మహాకవి సంకల్పించి కథా ప్రణాళికలను సంసిద్ధపరచుకొన్నట్లు వారి డైరీలు మనకు

తేటపరుస్తున్నవి. సాంఘికములే కాక, కొన్ని చారిత్రక నాటకములను కూడా రచించవలెనని ఆయన సంకల్పం. కాని ఆ సంకల్పం నెరవేరలేదు.

కొండుభట్టీయము రచనాకాలం 1906. రాజాసాహేబ్‌వారు వ్రాసిన మహాకవి లేఖలో: "1906 వేసవిలో నేనింకొక వచన నాటకాన్ని ఊటీలో పూర్తిగా రచించాను. కాని వ్రాతప్రతి కనిపించడంలేదు" అని వుంది. ఈ లేఖ వ్రాసిన తేదీ: 26 సెప్టెంబరు 1908. అయితే దీనిని తిరిగి రచించి 24 మే 1909 నాటికే పూర్తిచేసినట్లు, అదే తేదీన శ్రీవంగోలు సుబ్రహ్మణ్యం గారికి, అప్పారాయకవి వ్రాసిన ఉత్తరం దాఖలా యిస్తున్నది: "మరొక నాటకం వ్రాతామని కథాప్రణాళిక సిద్ధం చేసుకున్నాను. వ్రాతప్రతిలో వున్న విషాదాంత నాటకం నీకు తెలుసున్నదే కదా. అయితే యిది అచ్చొత్తించే మార్గం? అక్కడే వుందయ్యా వున్న చిక్కల్లాను!"

ఈ విషాదాంత నాటకమును నాటి విజయనగర కళాశాలా ప్రిన్సిపాలు కీ. శే. కిళాంబి రామానుజాచార్యులవారు గవర్నమెంటు ఆర్కియాలజికల్ డిపార్టుమెంటుకు సూపరింటెండెంటుగా వుండిన వెంకయ్యగారు, విజయనగర ఆస్థాన వైయాకరణులు మండ లక్ష్మీకాంతశాస్త్రిగారు మరికొందరు పండితులు చదివి ఆనందించిరట.

"అచ్చొత్తించే మార్గం" ఎలాగునో చూసి "ఆ వున్న చిక్కును" దాటి మహాకవి, దీనిని పుస్తకరూపాన ప్రచురించడానికి, మదరాసు రైలులో వెడుతుండగా మార్గమధ్యలో ఆయన సందుగపెట్టెను దొంగలు ఎత్తుకుపోయారు! పెట్టెతో పాటు 'కొండుభట్టీయము' వ్రాతప్రతి కూడా మటుమాయమైంది! అంతటితో విసుగుచెందక తిరిగి దీనిని వ్రాయసమకట్టి 1910 నాటికి సుమారు మూడు అంకములు పూర్తిచేశారు. 1909 లో కన్యాశుల్కము రెండవసారి ముద్రించాలని, దానిని మార్చి వ్రాసినపుడు ఆ నాటకానికీ, దీనికీ పోలికలు కనిపించడమలావుండగా, ఇందుగల చమత్కారములు కొన్ని, అందు చోటు చేసుకున్నవి.

1906 లో తాము రచించి మహాకవి పోగొట్టుకుంటిననుకున్న వ్రాతప్రతి, రికార్డులను గాలించగా వారి కుమారులు శ్రీ రామదాసుపంతులుగారికి దొరికినది. కాని ఆ వ్రాతప్రతి పూర్తిగ లభింపలేదు. దానినీ, 1910 నాటి కొత్తప్రతినీ సంప్రదించి సమన్వయించి యిదే రూపమున వారు 1939 లో

ముద్రింపించారు. పాతప్రతిలో మంజువాణి కొత్తప్రతిలో కనకవల్లిగా మారడమే కాక, కథావృత్తాంతమున అనేక వింత వింత మార్పులు పొడగట్టినవట. 1906 నాటి ప్రతినీ, దీనిని తైపారువేసి అవి తలేమో, సో సులేమో పరిశీలించుదామన్న, యిప్పుడు ఆ పాతప్రతి లభియించుటలేదు. ఇందు సంకలితము కాబడిన అముద్రితభాగములలో, పాత్రల వివరణ మరికొంత స్పష్టముగా విదితమవుతున్నది. ఈ నాటకమున వచ్చు 'సాహేబు' నిజముగా సాహేబు కాడనీ, కొండుభట్లును సంస్కరించుటకు వచ్చిన మారువేషధారి అనీ, అదే తలంపుతో కథ నడిపారనీ కొందరు పెద్దలు చెప్పడంకద్దు. దీనిని రుజువుపరచు గట్టి ఉపపత్తులను చూపించలేము కాని, ఊహించుటకు అవకాశం కలదు. ఇందు ముద్రితమైన అముద్రిత భాగములలో కనిపించే శంకరశాస్త్రి రామమూర్తితో సంభాషించేటపుడు, మరికొన్ని తావులందు కొండుభట్లును సంస్కరించుటకు తాను యత్నిస్తున్నట్లు రూఢిఅవుతున్నది. ఇంతేకాక, శంకరశాస్త్రి నటుడు; అతని కొక నాటకపు జట్టుకూడా వున్నది. అయితే శంకరశాస్త్రి సాహేబు రూపము ధరించినట్లు అచ్చుప్రతినిబట్టి స్పష్టీకరించాలము. సంఘసంస్కరణకోసం, శంకర శాస్త్రికి బదులు గిరీశము ప్రవేశించినట్లు ముద్రితభాగం రుజువుచేస్తున్నది. గిరీశము నడిపిన కథ మరివొక పుంతను పయనించినది.

అసలుప్రతి పోయినందువల్ల, 1906 నాటి ప్రతీ, 1910 సంవత్సరపు ప్రతీ వేరువేరుగా ముద్రితము కానందున, యిప్పుడీ రూపాన అచ్చొత్తించిన భాగములనుబట్టి యిట్టి విషయాలను తేల్చడం కష్టం. నాటకమున సమన్వయభావము చదువరులకు స్పష్టముగా తెలియరకపోవడం సహజం; అయినను కొన్ని ముఖ్యనిర్ణయములను కావించుటకు అవకాశమున్నది.

"ప్రాతప్రతిలోవున్న విషాదాంత నాటకం నీకు తెలిస్తున్నదేకదా" అనే మహాకవి లేఖలోని మాటను పురస్కరించుకొని, యీ నాటకము ఎలాగున విషాదాంతముగ పర్యవసించినదో పూజ్యశ్రీ సుబ్రహ్మణ్యము గారిని తెలుపవేడితిని. కాని యిది నలభైఏదేళ్ళనాటి మాట! ఆ కథాశేషము వారికి యెంతుల జ్ఞప్తికిరాగలదు!

కొండుభట్టీయము, బిల్హణీయములలోని పాత్రలు మహాకవి యథార్థ ప్రపంచంనుండి పరిగ్రహించినట్టివి. నాటి మనుజుల ప్రవృత్తులు, పోకడలు

నాయందభిమాన మంకురించి నానురాను పుత్రప్రేమవంటి వాత్సల్యముగా పరిణమించినది. ఆ తరువాత కొన్నిరోజులకే ఆయన నాచేతకూడా ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికకు 'సన్నచోముని' గురించి వ్యాసము వ్రాయిస్తూ 'మీవంటి "పరిశుద్ధవాదులకు" అంగీకారముగా వుండేటట్లు శృంగార ప్రాధాన్యము లేని యితివృత్తమును నాటకముగా చేసి వ్యావహారిక భాషను వ్రాస్తాను' అని సంకల్పించి బిల్హణీయము యెత్తుబడిచేసినారు." ఈ వాక్యములు కీ శే. డాక్టర్ బుర్రా శేషగిరిరావు పంతులుగారివి. అయితే కన్యాశుల్కం నాటకమును గురించి శేషగిరిరావు పంతులుగారు కావించిన విమర్శనమును మహాకవి 'అవును' అని ఆమోదించినట్లు కనబడదు. ఇందుకుగల అనేక ప్రమాణాలలో కొన్ని మాత్రమే ఉదహరించిన చాలును: "షేక్స్పియరుతో మొదలెట్టాలంటే నాలుగవ హెన్రీ, ఐదవ హెన్రీ, మెర్రీవైవ్స్ అనే నాటకాలలో వచ్చే డాల్ టీర్‌షీటు, మైన్ హాస్టెస్, డేమ్‌క్విక్లీ; ఇవన్నీ కూడా సర్ జాన్ ఫాల్‌స్టాఫ్‌తో ఒక కూటమిగా యేర్పడి యెంతో శక్తిని కలిగింపజేస్తాయి...... పోకిరీ అయిన ఫాల్‌స్టాఫ్ షేక్స్పియరీయను హాస్యానికి మహోన్నతగతివలె ప్రాతినిధ్యం వహిస్తున్నాడు...... కవితా కళను నేను లొంగిపోజేసినవాడనే ఐనా, నాకు మానవసమాజంపట్ల సహానుభూతిగ బాధ్యత అనేది ఒకటి వున్నది కనుకనే పాఠకులు నన్నొక ప్రశ్న అడగవచ్చును. ఒక దోషాన్ని, దుర్నీతిని, అవినీతిని ఆకర్షవంతంచేశానా? చేయలేదని భావిస్తున్నాను...... మానవజీవితంతో నేను చెలగాటం ఆడలేదనే లేదని యీ నాటకం చదివితే మీకు తెలుస్తుంది. ఎట్టి తృణీకార భావమూ లేకుండా, మానవ జీవితాన్ని గంభీరమైనదానినిగా భావించి ఈ నాటకంలో దానిని యితివృత్తంగా స్వీకరించాను...... వాస్తవికరచన అనే దానిని కళలలో ఎంత అపగ్నపూరితం చేసినప్పటికీ మానవుని నైతిక ప్రమాణాలను అది స్పృశించక తప్పదు. అతని నైతికదృష్టికీ, భావాలకూ కష్టం కలుగక మానదు." ఇవి మహాకవి, శ్రీ సుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖలోని అనేక సంగతులలో కొన్ని మాత్రమే.

కాని మహాకవి యెత్తుబడిచేసిన బిల్హణీయము గ్రామ్యగ్రాంథిక సంరంభములో పత్రికావాదములలో పడి, కడతేరా వ్రాయక వదలిపెట్టిరి. ఇదే కారణాన కన్యాశుల్కము త్రిలోజీగా వ్రాయాలనే వారి తలంపు రెండు రంగాలవరకూ సాగి నిలిచిపోయింది.

బిల్హణీయము ప్రాచీన సంస్కృత కావ్యము. ఇందులో కథ తక్కువ. వర్ణనలు ఎక్కువ. క్లుప్తంగా కథ యిది: మదనాభిరాముడు పాంచాల దేశపురాజు. అతని పట్నం లక్ష్మీమందిరమనే పేరుగలది. భార్య పేరు మదనమాల. కూతురు యామినీపూర్ణతిలక. ఆమె మిగుల అందగత్తె. కుమార్తెకు కావ్యాభినివేశమును కల్పింప తండ్రి ఆశయం. ఇందుకు తగినవాడు బిల్హణుడేనని నగరులోని పండితులు రాజుకు చెప్పుతారు. బిల్హణుడు కవి, రూపవంతుడు. అతనివద్ద తన కూతురును చదివిస్తే బిల్హణుడి 'చాపల్యముల' చిక్కుకుంటుందని రాజునకు భీతి జనించింది. కాని అతడే సరి తగిన విద్యాగురువు. ఇందుకు మంత్రి వొక ఉపాయం చెప్పి రాజుకు ఉపదేశించాడు. అది యిది: బిల్హణుడు కుష్టురోగిని చూడనొల్లడు. తాను అంధుని ముఖము తిలకించనని యామినీదేవి శపథంపట్టిందికదా. బిల్హణుడు అంధుడని రాజపుత్రికకూ, రాజపుత్రిక కుష్టుదని బిల్హణునికీ చెప్పి యిరువురి మధ్య వొక తెర అమర్చి విద్యాభ్యాసం జరిగించాలని మంత్రి ఆలోచన. రాజు సరే నన్నాడు. కాని కొంత కాలానికి యామినీ బిల్హణులకు యీ రహస్యం తెలిసిపోయింది. ఉదయిస్తున్న చంద్రబింబాన్ని చూసి దాన్ని వర్ణిస్తోన్న బిల్హణుడు యామినికి కనబడకపోయినా అంధుడైతే ఎలా చంద్రుని వర్ణించగలడని మధ్యనున్న తెర తొలగించి ఆమె తొంగి చూసింది. యామినీ బిల్హణులకు ప్రేమ కుదిరింది. అంతఃపుర ద్రోహానికి తలపెట్టినందుకుగాను బిల్హణుని పీక ఉత్తరించమని రాజు ఆజ్ఞ. వధ్యస్థానానికి తీసుకుపోబడిన బిల్హణుడు చెక్కుచెదరక చిరునవ్వు నవ్వగా, ఆశ్చర్యంతో రాజోద్యోగి అందుకు కారణ మేమిటని అడిగాడు. యామినీదేవి సదా స్మృతియందుండుటవలన తనకు వెరపన్నది కలగడంలేదని బిల్హణుడి సమాధానం. తనకూ, యామినీపూర్ణతిలకకూ గల ప్రేమను బిల్హణుడు కొన్ని శ్లోకములలో వర్ణించాడు. వారిరువురి ప్రేమగాథను విని రాజోద్యోగి జాలిపడి, బిల్హణుని ప్రసన్నుని చేయవలసినదిగా రాజును ప్రార్థించాడు. రాజు కనికరించాడు. యామినీ బిల్హణులకు వివాహమయింది.

సంస్కృత బిల్హణీయమునకు తెలుగు అనువాదాలు వున్నవికాని, అందు సింగనార్యుని ఆంధ్ర 'బిల్హణీయమే' ప్రాచుర్యము వహించినది. ఇది మూలమునకు యథాతథ ఆంధ్రానువాదమూ కాదు; అట్లని కాకనూపోదు.

మహాకవి గురజాడ నాటకీయము చేసిన 'బిల్హణీయము'నకూ, సంస్కృత మూలానికీ పోలికలు లేవనే చెప్పవచ్చును. సింగనార్యుని ఆంధ్రానువాదంలోగల మార్పులతో యీ బిల్హణీయ నాటకానికి ప్రసక్తియే లేదు. మూలమున బిల్హణుడు కాముి. ఇట మహామేధావి. అందు కథ నడచిన దారి వేరు. ఇందు మహాకవి త్రొక్కిన త్రోవ వేరు. కాగా ఇది సర్వస్వతంత్రరచన. అట్టి తారతమ్య పరిశీలన చేయుటకు యీ సంపుటిలో అముద్రితభాగాలను పొందుపరచినాము.

మహాకవి రచనలు కొన్ని పుస్తకరూపమున ముద్రించి వారి కుమారులు శ్రీ రామదాసు పంతులుగారు 'వాగనుశాసనులు' శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారికి పంపినపుడు, వారు 8, అక్టోబరు 1929 లో వ్రాసిన లేఖలోని వాక్యాలను స్మరిస్తూ మహాకవి రచనల నన్నిటిని కొన్ని సంపుటాలుగ ఆంధ్ర సోదరులకు సమర్పింపగలుగుతున్నందుకు ఆనందిస్తున్నాము.

వాగనుశాసనులు గిడుగు రామమూర్తి పంతులుగారి లేఖలోని వాక్యములు : "పుస్తకము చూసి చాలా సంతోషించాను; కళ్ళకు అద్దుకొన్నాను; ముద్దుపెట్టుకొన్నాను. మీ నాన్నను చూసినట్లు అయినది."

అట్టి మహాకవి రచనలు ఇందు కొండు!

— అవసరాల సూర్యారావు.



# ప్రధాన పాత్రలు



| | | |
|---|---|---|
| కొండుభట్లు | : | అగ్రహారీకుడు |
| రామ్మూర్తి | : | కొండుభట్లు కుమారుడు |
| వెంకన్న | : | కొండుభట్లు అన్నకుమారుడు |
| గిరీశం | : | రామ్మూర్తికి మాష్టరు |
| అకాలభత్తుడు | : | వెంకన్నకు చేదోడు వాదోడుగా వుండే వ్యక్తి |
| త్రివిక్రమరావు | : | తుమ్మలపాలెం మొఖాసాదారు |
| దివాన్ బహద్దర్ రాజారాం | : | ఇంద్రపట్నం బ్రహ్మసమాజ కార్యదర్శి |
| కేశవరాయుడు | : | హెడ్ మాష్టరు |
| రంగనాయకులు శెట్టి | : | కొండుభట్లు స్నేహితుడు |
| మంజువాణి | : | రామసాని పెంచిన వేశ్య |
| రత్నాంగి | : | మంజువాణి ఆశ్రితురాలు |
| పార్వతి | : | కొండుభట్లు మేనకోడలు, వితంతువు |



# కొండుభట్టీయము

## ప్రథమాంకము

### ప్రథమరంగము

[మంజువాణి యిల్లు: మంజువాణి తల దువ్వుకుంటూ కుర్చీపైని కూర్చుండును. కొండుభట్లు ప్రవేశించును.]

మంజువాణి: దండం, శాస్తుల్లుగారికి; వెంకీ! శాస్తుల్లుగార్ని కూర్చోబెట్టి పీట వెయ్యే.

కొండుభట్లు: సకలైశ్వర్యసిద్ధిరస్తు, పంతులవారు పాదాక్రాంతాభవంతు... ఆ తలవెండ్రుకలు సాక్షాత్తూ చమరీ వాలాల్లాగ శోభిల్లుచున్నాయి. విన్నావా, మంజువాణీ!

మంజువాణి: ఇంకా యేవి యెలా వున్నాయి?

కొండుభట్లు: యెన్నిన్ని వర్ణించడానికి సెఖ్యం కాకుండా వున్నాయి......ముఖం చంద్రబింబంలా వున్నది. కళ్ళు కలవరేకుల్లా వున్నాయి. గళం శంఖంలా వున్నది. బాహువులు లతల్లా వున్నాయి. మరెవచ్చీ...

మంజువాణి: మరెవచ్చీ, అక్కడ ఆగండి.

కొండుభట్లు: మంజువాణీ! అధికం యేల? నీ సౌందర్యం రంభా, ఊర్వశీ, మేనకా, తిలోత్తమాదుల్ను ధిక్కరించి వెక్కిరించియున్నది.

మంజువాణి: మా పంతులుగారి వెధవ అప్పగారిసాటి యేమాత్రమయ్నా వస్తుందా!

కొండుభట్లు: హాస్యానికైనా అనకూడని మాటలున్నాయి.
(పొడుం పీల్చును)

మంజువాణి: చెయ్యగా లేంది, చెప్పడమూ తప్పొచ్చింది!

కొండుభట్లు: దేవతలు, బ్రాహ్మలు చేసే పనులు తప్పు పట్ట కూడదు. స్వర్గంలో వాళ్లు దేముళ్లయితే భూలోకంలో మేం దేముళ్లం; అంచేతనే మమ్మల్ని భూసురులంటారు. చదువుకున్నదానివి నీకు తెలియందేమున్నది.

మంజువాణి: వెధవల్ని తరింపచేసే భూసురోత్తములకు నమస్కారము. (నిలుచుని నుదుట చేతులు మొగిడ్చి నమస్కారము చేయును)

(భీమారావు పంతులు ప్రవేశించును)

భీమారావుపంతులు: ఏమి టీనాటకం?

మంజువాణి: ముక్కోటి దేవతలు స్వర్గంలోవుంటే భూమ్మీద దేవతలు బ్రాహ్మలని కొండిభొట్లుగారు శెలవిచ్చారు. అందుచేత వేశ్యయింటికి అనుగ్రహించి వేంచేసిన భూసురోత్తముల్ని కొలుస్తున్నాను.

భీమారావుపంతులు: నీవు యెంత యెకసెక్కంచేసినా మేం దేవతలమే. అందుకు రవ్వంతయినా సందేహము లేదు.

మంజువాణి: భూలోకంలో కృష్ణావతారంలాంటి రసికులు మీరు. కృష్ణావతారం ముదిరింది; కాని శాస్త్రులుగారు యే దేముడి అవతారమో పోల్చలేకుండావున్నాను.

భీమారావుపంతులు: పట్టణం వెళ్ళినప్పుడు పరంగి స్త్రీల సహవాసం చేశానని చెప్పేరుగనుక శాస్త్రుల్లుగారు సాక్షాత్తు నారదావతారం.

మంజువాణి : అన్నా; మరచిపోయినాను, ఎంత బుద్ధితక్కువ మనిషిని! దూరంగా నిలుచోండి. ప్రాయశ్చిత్తం చేసుకుంటేనేగాని దగ్గిరకు రాకూడదు.

భీమా : శాస్త్రుల్లుగారు! ఏమిటండి ప్రాయశ్చిత్తం? నఖక్షతమా, దంతక్షతమా?

కొండు : అది యెంతో అదృష్టవంతులకుగాని సంప్రాప్తమవుతుంది. ముక్కుతిమ్మన్న యేమన్నాడూ:

చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని తా
చినయది నాకు మన్ననయ చెల్వగు నీపదపల్లవంబు మ
త్తను పులకాగ్రకంటక వితానము దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్కమానవుగదా యికనైనా నరాళకుంతలా!

ప్వేతముఖులు గనక బ్రాహ్మడికి రజితదానంచేస్తే ప్రత్యవాయం పోతుంది; మా కుర్రవాడు మెట్రిక్లేషన్ పరీక్షకు కట్టాలి. ఈ బీదబ్రాహ్మడికి దానంయిస్తే సమయానికి మహోపనికివస్తుంది.

మంజు : నిత్యసువాసినికి సువర్ణదానం చెయ్యమని లేదా?

భీమారావు : (మెల్లగా) దీని తస్సాగొయ్యా బంగారపుసరుకు మళ్ళీ తెమ్మంటుందికాబోలు! తొందరపనివుంది; యిప్పుడే మళ్ళీ వస్తాను. (నిష్క్రమించును)

కొండు : మంజువాణీ! బహుపుణ్యాత్మురాలివి; యేమైనా సాయం చేస్తేనేగాని కుర్రవాడు పరీక్షకు వెళ్ళే సాధనం కనబడదు.

మంజు : పంతులుగారి అప్పని అడగరాదా?

కొండు: యెవర్నీ అడక్కుండా యేమయింది! వైదీకపాళ్ళని పుట్టించినప్పుడే బ్రహ్మ రాసిపడేశాడు: "ముష్టెత్తు కొండర్రా" అని!

మంజు: యేదీ, యిందాకటి పద్యం చదవండీ!

కొండు: (రాగవరసను చదువును)

చ. నను భవదీయదాసుని మనంబున......

.........అరాళకుంతలా.

(అలా రాగవరసని చదువుతూవుండగా వెనకవైపునచ్చి సంగీతవాణీ శాస్త్రులు వీపుమీద తన్నును)

ఓ స్నీఅమ్మాశిఖా......(అని తగ్గి) ఆహా! మల్లి పువ్వుల గుత్తా, పట్టుకుచ్చా, మలయమారుతమా వీపుతాకినది!

మంజు: సానిదాని కాలు!

కొండు: కాదు; కాదు; మన్మథుని వాడివాలు!

మంజు: ప్రాసకుదిరింది కాని, శాస్త్రులుగారు! యీ తాపు మదనశాస్త్రంలో క్రియకింద పరిగణన అవుతుందా! భూసురోత్తముల తన్నిన పాపంకింద పరిగణనమవుతుందా!

కొండు: పదిరూపాయలు పారేస్తే పుణ్యంకింద పరిణామం అవుతుంది.

మంజు: పాటుపడక పైసారాదు.

కొండు: బ్రాహ్మడి కల్లా సాపాటు వక్కటె పెద్దపాటు యేర్పాటుచేసి బ్రహ్మ పడేశాడు.

మంజు: అయితే పెందరాళే వెళ్లి ఆపాటు పడండి.

కొండు : మంజువాణీ! యెంత చదువుకున్నా మావంటివాళ్లం నీకు వక్కమాటకు సదుత్తరం చెప్పగలమా; బాపనాళ్లని కనికరించి ఒకడబ్బు సొమ్ము ఇవ్వాలిగాని.

మంజు : వేశ్యల ద్రవ్యం పాపిష్టిది. బేరంతెచ్చి రుసుం పుచ్చుకుంటే ప్రత్యవాయంవుండదు.

కొండు : ఈవూళ్లో నానాటికి రసికత సన్నగిల్లుతూన్నది.

"అంధునకు గౌరయు వెన్నెల" అన్నట్టు ఈ వూళ్లో మూర్ఖులకు నీ రూపలావణ్య విలాస విశేషములు అగ్రాహ్యములు. తోవంటపోయే పొన్నూరువాళ్ళను కాచి పట్టుకోవాలి.

మంజు : ఈ కంసాలాడు యింటి యెదుట దుకాణం పెట్టుకుని యిక్కడికి వచ్చేవాళ్లనల్లా వాళకం కట్టుతూవుంటాడు. వాడిని తెస్తే......

[ తెర ]

## ద్వితీయరంగము

( కొండుభట్టు ఇల్లు; వీధిసావిడి; రామ్మూర్తి, వెంకన్న ప్రవేశించుచు)

వెంకన్న : రాముడు! పరీక్షంటే యేమిటిరా?

రామ్మూర్తి : పరీక్ష అంటె యెగ్జామినేషన్.

వెంక : (పాడుం పీల్చును) యజ్ఞం నాకు తెలుసును. మేషం అంటే మేక. మేకపోతుని వేస్తారా ఏమిషిరా?

రామ్మూర్తి: ఫూలిష్! యజ్ఞంకాదు, మేషంకాదు, శాస్త్రాల్లో ప్రశ్నలు అడుగుతారు.

వెంక: నీకు శాస్త్రము వచ్చును? తర్కమా, వ్యాకరణమా?

రామ్మూర్తి: నథింగాఫ్ ది కైండ్? జాగర్ఫీ వకటి.

వెంక: అనగా?

రామ్మూర్తి: భూగోళశాస్త్రం.

వెంక: దానిలో యేమిటుందిరా?

రామ్మూర్తి: వెలగపండువలె గుండ్రంగావుండే భూమిమీద యేయే నదులు, సముద్రాలు, కొండలు వగయిరాలు యెక్కడున్నాయో చెప్తాతుంది.

వెంక: భూమి గుండ్రంగా వుంది? అబద్ధం! అబద్ధం! నలు చదరంగా వుంది; దాన్ని అష్టదిగ్గజాలూ మోస్తున్నాయి.

రామ్మూర్తి: నాన్‌సెన్స్! "కపిత్థాకార భూగోళం" అని మనవాళ్ళుకూడా అన్నారు. ఏనుగులమాట పాత మాట. అవి అన్నీ వెళ్ళిపోయినాయి.

వెంక: గుండ్రంగావుంటే యెవరు మోస్తున్నారు?

రామ్మూర్తి: ఎవ్వరూ మొయ్యలేదు. ఆకర్షణ శక్తివల్ల భూగోళం అంతరాళంలో నిలిచియున్నది.

వెంక: అలా చెప్పు. అదో శాక్తిశక్తి పేరు చెప్పావు. ఏదో వక దేవత లేక్పోతే యేదీ వుండదు. అయితే యీ వెధవలు పశ్చిమ సముద్రం చూశారూ?

రామ్మూర్తి: ఓ! దాన్లోకి ఓజీ, యెనిసి, లీనా అను మూడు నదులు ప్రవహించును.

వెంక; అబద్ధం, శుద్ధ అబద్ధం. హిమవత్పర్వతానికి వుత్తరం యేవడికారం పోవడ్డం? మనుష్యులు వెళ్ళితే చచ్చిపోర్రా! ఇదా దొరగనుండా శాస్త్రం. ఇంకా యే శాస్త్రం చదువుకున్నావు?

రామ్మూర్తి: హిష్టరీ.

వెంక: విస్తరా?

రామ్మూర్తి: చెరిత్ర.

వెంక: అనగా?

రామ్మూర్తి: తెలియనివాడితో యేమిచెప్పను. వేదాలు యెవ్వడు రాశాడో, రామాయణం, భారతం యెప్పుడు పుట్టేయో, అవి యెంత నిజం, యెంత అబద్ధమో......

వెంక: వేదాలు రాశారు? రామాయణం అబద్ధమా?

రామ్మూర్తి: ఆ! కావలసినంత. రాముడు దేముడు కాడు. మహారాజు రావణాసురుడికి ఒక్కటే బుఱ్ఱ; విన్నావా!

వెంక: ఈ పాపపు మాటలు వినకూడదు.

(చెవులు మూసుకుని పారిపోవును. ప్రవేశం: గిరీశం)

గిరీశం: అజ్ఞానం! ఈ అజ్ఞానం పోతేగాని మన దేశం బాగుపడదు.

రామ్మూర్తి: మా వెంకడికి మెదడు లేదు.

గిరీశం: మీ తండ్రి తెలివివున్న మూర్ఖుడు. భోగంవాళ్ళ యింటికి వెళ్ళి ఆశ్రయిస్తాడు. నీ పరువు తీసివేస్తున్నాడు. సమయము చూసి చీవాట్లు పెట్టాలి.

రామ్మూర్తి: అతనికి తోచినట్టూ అతను చేస్తాడు, మనకి తోచినట్టు మనం చేదాం.

గిరీశం: డామిట్! ప్రాణమయ్యా యిచ్చెయ్యాలిగాని రిఫారం విషయమై నదురూ బెదురూ వుండకూడదు. లేకుంటే మన దేశం బాగుపడే దెట్లు? మనకి బంగాళీవాళ్లలాగ పరువు ప్రతిష్ఠ వచ్చేదెట్లు?

రామ్మూర్తి: అయితే సమయంచూసి చివాట్లుపెట్టమంటారా!

గిరీశం: ఇంకా ఆలోచిస్తావా? అదుగో మీ తండ్రి వస్తూన్నట్టుంది, నన్నెరగనట్టు నటించు. రహస్యం భేదించకుండా నటించాలి.

రామ్మూర్తి: యెందుకేమిటండి!

గిరీశం: మీతండ్రి అసాధ్యుడు. నిన్ను గురించి యెంతో విచారిస్తున్నాను.

రామ్మూర్తి: ఆయనతో పరిచయం చేశారా యేమిటి?

గిరీశం: చేశాను నీకు చూస్తానన్న పిల్ల ముక్కుపచ్చలారని పసిపిల్ల. రిఫార్మర్ అనేవాడు అలాంటి పిల్లని పెళ్లాడితే సొసైటీ లుక్స్ డౌన్ అపాన్ హిం. సంఘం అతన్ని నిరసగా చూస్తుంది.

రామ్మూర్తి: అంచేతనే నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను. తెగించి దేశాలంట పోదునా అనిపిస్తూంది.

గిరీశం: నాతో యన్నడూ చెప్పకపోతివే!

రామ్మూర్తి: యేమని చెప్పను? సిగ్గుచేత చెప్పలేదు!

గిరీశం: ఒకరి లోపాలికి మనం సిగ్గుపడనేలా? చేతనయినంత వరకు మళ్లిద్దాం. మళ్లకపోతే కనికరిద్దాం. సిగ్గుతోనూ, కోపంతోనూ పనిలేదు.

రామ్మూర్తి: నామీద దయచేత మీరు అలాఅంటారు. లోకంలో తలయెత్తుకు యెలా తిరగను?

(తెర)

## తృతీయరంగము

(అక్కాభత్తుడి యింటి వీధిఅరుగు: వెంకన్న, అక్కాభత్తుడు ప్రవేశించుచు)

వెంకన్న: ఏనుగులు దొబ్బేశాయండోయి.

అక్కా: ఎవరి యేనుగులు? విజయనగరంవారివా? బొబ్బిలివారివా?

వెంక: కాదండి, దిగ్గజాలు.

అక్కా: ఎక్కడికి వెళ్ళిపోయినాయి?

వెంక: భూమి వెలగపండులా గుండ్రంగా వుందిష. అంచేత యేనుగులమోత అక్కరలేదుష.

అక్కా: భూమి వెలగపండయితే, యేనుగులు వెలగపండును తినేస్తాయి కాబోలును?

వెంక: మా రాముడు చెప్పాడు.

అక్కా : ఇంకా యేమి చెప్పాడు ?

వెంక : వేదా లెనళ్ళో రాశారుట, రాములువారు మనిషట, దేముడు కాడట.

అక్కా : మీకు కొండిభొట్లు ఇంగ్లీషు చదువు చెప్పించాడు కాడని నాకు కించగావుండేది. ఇంగ్లీషు చదువుకి యిదే ఫలితమయితే మరి విచారంలేదు. తురకలు మెడకు కత్తి మొన చేర్చి గొడ్డుమాంసం తినిపించేవారు. ఈ ఇంగ్లీషు వాళ్లు చదువులుపెట్టి మన వేళ్లతో మన కళ్ళే పొడుస్తున్నారు. అదిగో మీ బాబు వస్తున్నాడు; పారిపో.

(ఇద్దరు నిష్క్రమింతురు)

## చతుర్థరంగము

(కంసాలి దుకాణం : అక్కాభట్టుడు, కొండుభట్లు ప్రవేశించుచు.)

కొండుభట్లు : అక్కాభట్టుడుగారు ! దయలేదుకదా ?

అక్కాభట్టుడు : బ్రాహ్మణోత్తములు తమ దయ మాకుండవలెగాని, మాదయ యేమి చెవికార్థం ?

కొండు : విశ్వకర్మ అనగా సాధారణులండీ ! పురుషసూక్తంలో యేమిచెప్పాడో విన్నారా ? "విశ్వకర్మణ స్సమవర్తతాధి, తస్య త్వష్టా విదధ ద్రూప మేతి, తత్పురుషస్య విశ్వ మాజానమగ్రే..." "పురుషుణ్ణి" అనగా ఆ పరమాత్మున్ని త్వష్ట అనే కంసాలి చేశాడుట.

అక్కా: అలా అయితే బ్రాహ్మణ కన్న కంసాల్లు యెక్కువే గదా?

కొండు: సందేహమేమిటండి. అందుచేతనే కంసాల్లు బ్రాహ్మలకి దండం పెట్టరు. ఒక్క వాక్యమాత్రం బ్రాహ్మణులకు వుండుకున్నది. కంసాల్లకిగాని యితర వర్ణాలకిగాని లేదు.

అక్కా: అది యెటువంటిదండి?

కొండు: గొప్ప చెప్పుకోవలసినది కాదు. అది యేమిటంటె "ప్రతిగ్రహం"; తేనిగిస్తే ముష్టి యెత్తుకోవడమన్నమాట.

అక్కా: గడియకపోతే అది అందరికీ వున్న వాక్కే.

కొండు: గడిచినా బ్రాహ్మడికి తప్పదు. నూరుకోట్ల రాజ్యాలేలే శ్రీమంతుడికి తప్పిందికాదు.

అక్కా: అది యెలాగేమిటి?

కొండు: చిత్తగించారా! అహల్యాబాయి అని హోల్కారు మహారాజులుంగారి భార్య వుండేవారు. ఆవిడికి కోట్లకో ధనం వుండేది. ఆ మహారాణీ బహుదొడ్డ పుణ్యకార్యాలు చేశారు. కాశీలో ఒకఘట్టం కట్టించారు. సత్రువు వేశారు. చిత్తగించారా! ఒకనాడు శ్రీమంతులవారికి ద్రవ్యం కావలసివచ్చి అహల్యాబాయిగార్ని దోచుదామని దండెత్తి వెళ్ళేసరికి, ఆ మాట తెలిసి అహల్యాబాయిగారు యేం చేశారంటె ధనమంతా కుప్పపోసి స్నానంచేసి పట్టువస్త్రాలు ధరించి తులసిదళం జారీ చేత్తో పట్టుకుని శ్రీమంతులు రాగానే "మహారాజా, దోచడానికి యేమి అవసరం వున్నది, మీరు బ్రాహ్మణ మహారాజులు, ఈ తులసి

దళం, రెండు నీళ్ళ చుక్కలతోటి నా యావత్తు ధనం పరిగ్రహించవలసినది. ఇంత పాత్రతయిన దానం యెలా లభిస్తుంది” అని ఆ మహారాణి అన్నాగుట!

అక్కా: సరేకాని అపాత్రదానంవల్ల దోషం లేదా?

కొండు: ఈ కలియుగంలో పాత్రాపాత్ర విచారించడానికి అవకాశ మేది. అంతా పాపభూయిష్ఠమైయున్నది. “బ్రాహ్మణ బీజాయతే నమః” అన్నాడు. గనక బ్రాహ్మణ బీజానికి పుట్టితే చాలును.

అక్కా: అదైనా నిశ్చయము కద్దా?

కొండు: లోకమంతా నమ్మకంతో వుంది. నమ్మకం లేకుంటే అడుగుతీసి అడుగు పెట్టడానికి వీలు లేదు. నమ్మి యెన్నో వెండి బంగారాలు లోకులు తమ కిస్తున్నారు కారా? అసాక్షికం, లేదంటే ఏమిటి చెయ్యడం. “నమ్మి చెడిన వారు లేరు, నమ్మక చెడిపోతే పోయేరు” అన్నాడు.

అక్కా: శాస్త్రిలు చెడి తంబళిపదాల్లోకి వచ్చారయా!

కొండు: భారతంలో యేమన్నాడు, “లోకజ్ఞున్” అన్నాడు. అంచేత లోకంలో వేదం మొదలుకుని తంబళిపదాలవరకూ యావత్తు హంశములు తెలిస్తేగాని పండితుడు కానేరడు. ఇదిగో శాస్త్రంలో ముక్క మనవి చేసుకుంటాను. కంసాలి అనగా కంసారి. “రలయోరభేదః” అన్నాడు. కనుక కంసాలి శబ్దార్థం సాక్షాత్తు శ్రీకృష్ణమూర్తివారని సిద్ధాంతం.

అక్కా: నేను కృష్ణమూర్తిని అయితే, సత్యభామని యెక్కడయ్యా ఆలోచించారా, లేదా?

కొండు : అదే నేను మనవి చెయ్యాలనుకుంటున్నాను. సత్యభామకోసం యెక్కడకైనా వెళ్ళాలా, యేమిటి ? తమ యింటియెదుటనే కాచి వేచియున్నది. మంజువాణి బంగారు బంతి. దాని రూపురేఖవిలాసా లెఘువంటివనగా...

అక్కా : అదంతా నిజమే కాని "మిక్కిలి రొక్కము లియ్యక చిక్కదురా, వారకాంత సిద్ధము సుమతీ" అన్నాడు. నేను డబ్బెక్కడ తేను !

కొండు : (శ్రీ) విష్ణుమూర్తివారియందు సత్యభామకు వలెనే ఈ మంజువాణికిన్ని మీయందు మనస్సు లగ్నమయి వున్నది.

అక్కా : అది చెప్పిందా ? మీరు పోల్చారా ?

కొండు : అది చెప్పనూ చెప్పింది. అయితే మాటల్లో మర్మము వుండవచ్చును కాని, కామశాస్త్రంలో చెప్పిన హావభావ చేష్టల్ని పట్టి పండిత ముండాకొడుకుని ఆపాటి పోల్చలేనా! "స్తంభః ప్రళయ రోమాంచ, శ్వేదో వైవర్ణ్య వేపథుః"

అక్కా : ఒక్కొక్కటే సెలవియ్యండి.

కొండు : తమర్ని స్మరించేటప్పటికి "స్తంభః" స్తంభించిపోవడం.

అక్కా : అగ్ని స్తంభమా, జల స్తంభమా ?

కొండు : స్తంభమనగా, నిశ్చేష్టగా నిలిచిపోవడము.

ప్రళయః ... ఇంద్రియవ్యాపారాలు అణగడం.

రోమాంచ ... వెంట్రుకలు పులకరించడం.

స్వేదం ... చెమట పొయ్యడం.

వైవర్ణ్యం ... తెల పోవడము.

వేపథుః ... వణకడం

ఇవి అన్నియు ప్రేమాతిశయ ద్యోతకాలు.

అకా్ట: నా వ్యాఖ్యానం వింటారా... నాలుగు నెలలు చేసి సున్ని బస్తీ బొంకలేకపోతే చెల్లగొట్టడం. ఒక సరసుడు పుండుగా మరో సరసుడు వస్తే స్తంభన అంటారు ఒకణ్ణి స్తంభం నీడన కాల దాచడం. శీతాకాలంలో సరసుల్ని ఒంటరిగా పడుకుంటే, వేసవులో, రోమాంచ; ముసిరినప్పుడు సరసుడు డబ్బు యియ్యకపోతే ప్రళయం, ఇవి హావభావ చేష్టలు.

కొండు: బంగారం గీటు గియ్యనిదీ నాణెం చెయ్యనుగదా? పండు రుచిచూడనిదీ తారీఫు చెయ్యగూడదు. స్త్రీని అనుభవించి మెచ్చాలి. సుఖాలు అనుభవవేద్యాలుగాని వర్ణింప వీలైనవి కావు

అకా్ట: సత్యభామని నేను తగులుకుంటే, ఇంట్లో యిల్లాల్ని యెవరికి వప్పచెప్పను.

కొండు: తమ యిల్లాలు సాక్షాత్తూ రుక్మిణీదేవిలాగు కీర్తి ప్రతిష్టలు సంపాదించివున్నారు. జ్ఞాపకం తెచ్చారు, వారి నోములకి నా పౌరోహిత్యం మానివేశారు కదా.

అకా్ట: మీరు కాలం అంతా హాస్యంలో వెళ్ళబుచ్చుతున్నారు. చిన్ననాడు చదువుకున్న ముక్కలు జ్ఞాపకం వున్నాయో లేవో ?

కొండు: దాని ముండామోసిపోయెను. నిలుచున్న పట్లాన యజ్ఞాదిక్రతువులు చేయించమంటే చేయించి వేస్తానుకదా, నోములు నా చేతకావూ ?

అకా్ట: తమరే సెలవిచ్చారుకదా, కంసాలులు బ్రాహ్మణులకంటె అధికులని! అంచేతనే వీరభాచార్యులు మా యిళ్ళల్లో పౌరోహిత్యం చేస్తున్నాడు.

కొండు : తమకి యిదో మేహాసత్తుకాదుకాని మంజువాణి దగ్గరనుంచి చిన్నపని తీసుకువచ్చాను. చిత్తగించారా (సంసగోంగుశక్తి బొడ్డుదగ్గిర యిుడిచిన బంగారపు కమర్‌పట్టా మొలతాడుతీసి) యిది చెరిపి బంగారం గోవాతాడు చేయించమంది.

అక్కా : (పరీక్షించి ఆశ్చర్యంగా) ఆహా! యిది మాతండ్రి పంతులు తల్లికి తయారుచేస్నిది. ఇంత పనివాడితనం వున్న యీా పాతెలు చితకగొట్టుటకు చేతులు యెలావస్తాయి; ఇది పంతులు యింటివద్ద పోయినదని కలవిలపడి వూరు కున్నారు. కానియ్యి! ఇది పంతులు భార్యాకు యిచ్చి వేస్తాను. (ప్రకాశం) యెంతట్లో కావాలి?

కొండు : ఎంతవేగం వీలైతే అంతవేగం కావాలి.

అక్కా : సరే! (మొలతాడు పెట్టెలో పెట్టి తాళంవేసి) మీా కుర్ర వాడు వచ్చినట్టుంది, చదు వలాగుంది?

కొండు : ఈసరికి బాగా వుంది. ఇప్పుడు మెటికి లేమను పరీక్షకు కడతాడు. ఇరవై రూపాయిలు కావాలి. తమవంటివారి సహాయం వుంటేగాని గట్టుదాటను.

అక్కా : (ఇరవయి రూపాయిలు పెట్టెలోనుంచి తీసియిచ్చి) గుప్త దానం మంచిది. ఎవరితో చెప్పకండి.

కొండు : (అక్కాభక్తుడి చెవిలో) చూశారా మంజువాణి, డబ్బు లక్ష్యంగాని, డబ్బు జాగ్రత్తగాని వున్నమనిషి కాదు. బంగారం కరగడంలో కొంచంకొంచం చెయ్యి తడిచేసుకో వచ్చును. మావాడి వివాహం వొకటి తటస్థించింది. డబ్బుకి వ్యాపకపడుతున్నాను.

అక్కా : అలాగే కానియ్యండి. తూనిక మీరు కలవిచ్చినట్టు అందాదుగా చూసుకుందాం. ఈ సరకు యిలాగేవుంచి నాదగ్గిర బంగారం పెట్టి జమిలిగోవాతాడు తయారు చేస్తాను. కాని! మీ కుర్రవాడు, భూమి గుండ్రంగా వుందునని, రామాయణం అబద్ధమని అంటాడుట. విధవముండలకి పెళ్లి చెయ్యమంటాడుట. మీరు విన్నారా?

కొండు : అది అంతా యింగ్లీషువాళ్ల మాటలు. అలా అంటే గాని పరీక్షలు ప్యాసు చెయ్యరు.

అక్కా : మీకొడుక్కి యింగ్లీషు చెప్పించి, మీ అన్న కొడుక్కి యెందుకు చెప్పించారుకారు?

కొండు : ఒకడికి చెప్పించడమే కృత్యాద్యవస్థగావుంది. ఇద్దరికి చెప్పించడం నా తరంమా?

అక్కా : వెంకన్నకే యింగ్లీషు చెప్పించి, రామ్మూర్తికే కావ్యాలు యెందుకు చెప్పించారుకారు?

కొండు : అక్కాభత్తుడుగారు! అన్నీ యక్షప్రశ్న లడుగుతారు. మనమా చేసేవాళ్ళం? జాతకంలో యోగం వుండాలిగాని!

అక్కా : యోగం యెలావుంటే వుండనియ్యండి, కాని వెధవముండ నెవర్తినీ పెళ్లాడకుండా వివాహం ముందు చెయ్యండి.

## పంచమ రంగము

[కొండుభట్లు యింటి పెరట్లో పెంకుటిసాల. పొయిమీద నీళ్ళ కాగు. పొయ్యిలో నిప్పులేదు. పిసుకాయుండా, అంగవస్త్రం ధరించి, కొండుభట్లు నీళ్ళకాగువంకకి తిన జుత్తు వదుల్తాడు. గావంచాతో తడి జుత్తు తుడుచుకుంటూ వుంటాడు.]

కొండుభట్లు: తల వెంట్రుకలకి శీతోష్ణాలు తెలియకుండా చేసిన భగవంతుడి ప్రజ్ఞ ఏమని పొగడనూ! లేకపోతే శీతకాలంలో తెల్లవారగట్ల చన్నీళ్ళలో మునగడానికి మహా మానా?

(విభూదిబుర్ర గూట్లోంచి తీసి బాలరామాయణం చదువుతూ నుదిటికీ, చెంపలకీ, గుండెకీ రాసుకుంటాడు)

కూజంతం......రామ రామేతి... మధురం మధురాక్షరం ఆరుహ్య కవితాశాఖా శా...ఖాం వందేవా...ల్మీకి కోకిలం. యఃపిబన్ సతతం రామ...

చప్పుడౌతుంది. లేచాడు గాబోలు (గట్టిగా) చరితామృత సాంగం। అత్ర ప్రస్తం మునిం వందే ప్రాచేతస మకల్మషం। గోష్పదీకృత వారాసిం మశకీకృత రాక్షసం.

(రామ్మూర్తి ప్రవేశించును)

అబ్బీ మేష్టరు లేచార్రా?

రామ్మూర్తి: మేష్టరుగారు యేటికి స్నానాని కెళ్ళారు.

కొండు: యీచల్లో యేట్లో యలా స్నానం చేస్తాడ్రా. ఉద్దండ పిండంలా వున్నాడు.

రామ్మూర్తి: మీకంటే యెవరైనా నయం.

కొండు: తండ్రిం తప్పట్టకూడదు; తెలిసి దా. మాతృదేవో భవ, పితృదేవోభవ అని వేదం ఘోషిస్తోంది.

రామ్మూర్తి: రాత్రి యెక్కడికి వెళ్ళావు?

కొండు: పెద్దల్ని పిన్నలు ప్రశ్నించకూడదు. యూభి గోడల్ని దాటి. తుదకి నీకా నేను సమాధానం చెప్పడం! నా బతుకు అంతకొచ్చింది!

అంజనానందనం దేవం జానకీ శోకనాశనం।

కపీశ మక్షహంతారం వందే లంకాభయంకరం!

రామ్మూర్తి: ఆ శ్లోకాలు కట్టిపెట్టి నేంజెప్పే మాటలు వినండి. "ప్రాప్తే షోడశవర్షాణి పుత్రం మిత్రవ దాచరేత్" అన్నాడు

కొండు: (చిన్న రాగిజారీ చేతపట్టుకొని నిలిచి) నా శాస్త్రంముక్కలు నామీదకే విసురుతున్నావ్! ఆ చెప్పే మాట ఒద్దో చెప్పా. ఇటుపైని నువ్ తండ్రివి నేను కొడుకునీనీ!

రామ్మూర్తి: మీరు రాత్రి రామసాని పంచనో, పంతులుగారి పంచనో తిని పడుకుంటారని మా గురువుగారితో అమ్మ చెప్పేసరికి నావొళ్ళు నీరు విడిచిపోయింది. మీరు సానిదాని కొంపకి వెళ్ళడమైనా మానెయ్యాలి; నేను మీ యింట్లో అడుగు పెట్టడమైనా మానాలి.

కొండు: (నిర్ఘాంతపోయి) యేమంటున్నావ్!

రామ్మూర్తి: మీ ప్రవర్తన బాగుంది కాదు.

కొండు: మతిపోయి మాట్లాడుతున్నావా యేమిటి! బ్రాందీ తాగ లేదుకద!

రామ్మూర్తి: అదొక్కటే తకువాయుఁడిపోయింది. మీారు సానియింటికి వెళ్లడం నాకు యిష్టంలేదు.

కొండు: గుడ్డోచ్చి పిల్లని వెక్కిరించిందని ... నీ యిష్టం యెవడిక్కావాలి. ముండయేత ప్రసంశ! యే దొమ్మరి గుడిసెలూ దూరకపోతే, యే అకార్యకర్ణాలు చెయ్యక పోతే నీకు బోలిడేసి డబ్బుపోసి చదు వెలా చెప్పిస్తున్నా ననుకొన్నావు?

రామ్మూర్తి: సానికొంపలు తిరిగి తెచ్చే డబ్బుపెట్టి నాకు చదువు చెప్పించక్కర లేదు!

కొండు: అయితే మున్నబీదాకా చదువుకోవూ? నీయఃథాన్న యిదివరకల్లా బోస్నిడబ్బ తా బూడిదలోపోసిన ఒన్నీ రే? ఇదిఃరకు తిన్నదిమాత్రం దుష్టడబ్బు కాదా యేమిటి? అది ముందు వెళ్ళగక్కి తరువాతీ శ్రీరంగనీతులు చెప్పు.

రామ్మూర్తి: మీారు మన యింటిపరువు తీసేస్తున్నారు.

కొండు: ఓరీ! నీ పరువుకు తండ్రినయినాను గాను, రాముడు దేవుడు కాడని. వెధవముండల్ని పెళ్లి చేసుకొమ్మనే కిరస్తానపు వెధవలకు సానింటికి వెళ్ళితే తప్పొచ్చిందీ? నీ పెళ్ళికూడా సమీాపించింది. కిరస్తానంలో కలిసిపోవా లనుంటే యీాలోగానే కలిసిపో! నీ మేనమామ కూతురు కొంపెందుకు తీస్తావు!

రామ్మూర్తి: నేను కిరస్తానంలో యెంతమాత్రం కలియను.

కొండు: ఈ తండ్రిమీాద తిరుగుబాటంతా యేమిటి?

రామ్మూర్తి: నేను బ్రహ్మసమాజంలో కలిశాను.

కొండు: బ్రహ్మసమాజం యేమిటి? విష్ణుమతం, శివమతం అని సృష్ట్యాదినుంచి విన్నాంగాని బ్రహ్మకి పూజెక్కడేడిసింది? పోనియ్యి, యే సమాజమైనా యేమిట్లో మన దేవుణ్ణే పట్టుకుని కిరస్తానంలో కలియకుండావుంటే చాలు.

రామ్మూర్తి: కిరస్తానమతం అసత్యమతం. దాన్లో బుద్ధిమంతు డెవడూ కలియడు.

కొండు: అదిగో! ఆమాత్రం మంచిమాటన్నావంటే నాకు పరమానందం. (కౌగలించుకొని) మున్సబీ పరీక్షకోసం తెల్లవాళ్ళ చదువు చదువుగాని, స్వేతముఖులు కల్పించి మన మతం చెడగొట్టాలని వ్రాసిన సంగతులు ఒకటయినా నమ్మవద్దు. ఇదిగో యిరవై రూపాయీలు తెచ్చాను. ఇవి కట్టి మెటిక లేషను పరీక్షకు వెళ్ళు.

రామ్మూర్తి: (రూపాయిలు పుచ్చుకొని) సానింటికి వెళ్ళడం మానేస్తే బాగుండును.

కొండు: మరో పరమార్థంమాట మనస్సులో వుంచుకోవాలి. విన్నావా? జాజిమొక్కకి పేడ వగైరా అసుద్ధపదార్థములు వేసే మొక్క పెరిగి పరిమళభరితములగు పుష్పాలు పూస్తుంది. చెట్టుకి పేడవేశామని పుష్పాల కేమయినా అపవిత్రత వచ్చిందా? అవి దేవుడి నెత్తిమీద పెడతాం. అట్లాగే నే యే మాయోపాయంచేతనైనా ద్రవ్యం సంపాదించి పెద్ద అవస్థలోనికి వచ్చింతరువాత వుచితంగా ధర్మంచేస్తే పాపాలన్నీ దహించుకుపోతాయి. నీ పెళ్ళి అయిన తరువాత శివపంచాక్షరీ మంత్ర వుపదేశం చేస్తాను.

దాంతో విద్యా, ఐశ్వర్యము, ముక్తి కూడా లభిస్తాయి; యెగిరిపోతాయి.

రామ్మూర్తి: [ఆత్మగతంగా] కాష్టవాదంవల్ల కార్యం లేదు; ఎంతయ్యా పెద్దవాడు. తండ్రిగదా! [ప్రకాశం] అలాగే!

(తెర)



# కొండుభట్టీయము

## ద్వితీయాంకము

### ప్రథమరంగము

[కొండుభట్లు యింటి అరుగుమీద చాప పరుచుకొని వెంకన్న కూర్చుని చుట్ట చేతితో పట్టుకొనును ]

వెంకన్న : రాముడు చుట్ట మా తీవిగా కాలుస్తాడు. ముక్కులోంచి పొగ తెప్పిస్తాడు. ఆ విద్య పట్టుపడింది కాదు. (అగ్గిపుల్ల వెలిగించి చుట్ట ముట్టించుచుండగా తలుపు తీయబడును. చటుక్కున చుట్ట, అగ్గిపుల్ల పారవేసి తటాలున ముసుగెట్టి పడుకొనును.)

పార్వతి : (ప్రవేశించి గుమ్మముకట్ట నిలబడి : మెల్లగా) "వెంకడూ! వెంకడూ!" (వెంకన్న మారుపలుకక నిద్రించినట్లు నటించును. పార్వతమ్మ అరికాలు గోకి తిరిగి నిమ్మళముగా, "వెంకడూ! వెంకడూ!" అని పిలుచును )

వెంక : (కాలు ముడుచుకొని) నిద్రపోతున్నానే.

పార్వతి : దొంగనిద్రపోతున్నావు! నువ్వు చుట్టకాల్చడం నేను చూడలేదనుకున్నావా యేమిటి?

వెంక : చూశావూ?

పార్వతి : చూశాను.

వెంక : బాబుతో చెబుతానంటావా యేమిటి? కాల్చడం మానేస్తాన్లే.

పార్వతి : నే చెప్పినమాట వింటే చెప్పనుగదా, చుట్టలు కొండానికి రూపాయలుకూడా యిస్తాను.

వెంక: చుట్టల శిఘాగో శైనుగాని, పదిరూపాయిలంటూ యిచ్చావంటే పొడుం దుకాణం పెట్టుకుంఛాను.

పార్వతి: చెప్పినట్టు వింటే, పది కాదు, యిరవైరూపాయీలు యిస్తాను ......... యిప్పుడె యిమ్మంటావా యేమిటి?

వెంక: ఇచ్చావంటె నీకన్న పుణ్యాత్మురాలుండా?

పార్వతి: అయితే లోపలికి రా...... (అని గదిలోనికి వెళ్లును)

వెంకన్న: (సావిడిలోనికి వచ్చి నిలుచుని పొడుంపీల్చి) పార్వతి బహు దొడ్డమనిషి......బాబుకంటె నయం. నేను పొడుంకొట్టు పెట్టానంటె గఝ్ఝులు కొట్టుమీద పక్క దమ్మిడీ పొడుం చెల్లదు.

పార్వతి: (ఒకచేతితో విస్తరగంటుగా అట్లున్నూ, రెండవ చేతితో రూపాయిలున్నూ పట్టుకువచ్చి అట్లు కింగనుంచి) అట్లు తిను.

వెంకన్న: కాళ్ళూ చేతులు కడుక్కోని తడిగావంచా కట్టుకుని తింఛాను.

పార్వతి: (తనలో) నెత్తి నెధవ. (పైకి) మీ బాబు కాళ్లు కడుక్కోందీ పీఢీలోంచి వొచ్చిన బట్టతో తింటాడుగాని, నీకు అంతకన్న ఆచారం బలువయిపోయిందీ? తిన్నగా తిను.

వెంకన్న: కాళ్ళూ చేతులు కడుక్కోవద్దంఛావా యేమిటి.

పార్వతి: కాళ్లు కడుక్కుంటె చప్పుడవుతుంది.

వెంకన్న: చప్పుడవుతే యేమిటి?

పార్వతి: (తనలో) ముద్దు నెధవ! (పైకి) అంతా లేస్తారు.

వెంకన్న: (గట్టిగా) ఓ! హో! దొంగతనంగా తెచ్చావు?

పార్వతి: నిమ్మళంగా మాట్లాడు. చెప్పినట్టు వినకపోతే రూపాయి లివ్వను.

వెంకన్న: అనాచారంగా తింటె యిస్తానంటావా? (తినును)

పార్వతి: పదిరూపాయిలు యిస్తే యేం చేస్తావు?

వెంకన్న: పొగాకుకొని పొడుంకొట్టు పెడతాను. నేను పొడుం కొట్టు పెట్టానంటే మరి, వాడి కొట్టు పడిపోతుంది.

పార్వతి: గట్టిగా మాట్లాడకు.

వెంకన్న: నా పొడుం యెంత బాగావుంటుందనుకున్నావేమిటి! చిన్న పట్టు పీల్చిచూడు (అని యెడమ చేతితో మొలనున్న పొడుం కాయను చూపించును.)

పార్వతి: (ముక్కుమీద వేలుంచి) ఆడవాళ్లు పొడుం పీలుస్తారుటోయ్! (పొడుంకాయ మొలలోంచితీసి రూపాయిని మొలలో ముడుచును. అలా చేయుటలో తన శరీరము వెంకన్న పార్శ్వమునకు తగిలించును.)

వెంకన్న: (తనలో) యిదేమిటోయి! మీదపడుతున్నాది!

పార్వతి: (అట్టుముక్క తాను కొరికి వెంకన్న నోటి కందించును.)

వెంకన్న: యిదేమిటి? యెంగిలి తినమంటావా యేమిటి!

పార్వతి: నే చెప్పినట్టూ వింటానన్నావే (అని నోటిలో కుక్కును.)

వెంకన్న: (అయిష్టముతో మింగుతూ) యెంగిలి తినడానికి పది రూపాయిలు యిచ్చానంటావు!

పార్వతి: యింకా వుంది.

వెంకన్న: యేమిటుంది?

పార్వతి: యిదిగో (అని కౌగలించుకొనును.)

వెంకన్న : వెధవముండా! (అని విదిలించివేయును. పార్వతి నేలబడును. వెంకన్న పైకి పారిపోయి అటుగుమీద ముసుగుపెట్టుకుని పడుకొనును.) [గోసంగో] చచ్చానురోయి ! యిదేమి టీరంకుముండకి యీ కాలం...రామ ! రామ !

పార్వతి : (చీపురుకట్ట తెచ్చి) గాడిదకొడకా ! (అని కొట్టును.)

[ తెర ]

## ద్వి తీ య ర ం గ ము

[ అక్కాభత్తుడి యిల్లు ]

వెంకన్న : అక్కాబత్తుడూ – అక్కాబత్తుడూ (అని తలుపు కొట్టును.)

అక్కా : యెవరది ?

వెంకన్న : వెంకన్న.

అక్కా : (తలుపుతీసి పైకివచ్చి) యేమిటి వెంకన్న ?

వెంకన్న : కొంపమునిగింది !

అక్కా : ములగడానికి నీకు కొంపవుంటేనా ? మీ చినబాబు గారి కొంప మునిగినట్టాయినా, శుభవార్త చెప్పు.

వెంకన్న : కొంపమునిగింది.

అక్కా : యెందు కాతొందర ? నింపాదిగా చెప్పు...దొంగలొచ్చారా ? యిల్లంటుకుందా ? యేసయ్యా సంతోషమే!

వెంకన్న : చెప్పనా ?

అక్కా: (అనుగుణూ చూసుని) చెప్పు.

వెంకన్న: నేను చెప్పను.

అక్కా: చెప్పకపోతే యింట్లోకి పోయి అచ్చగా పడుకుంటాను.
(లేచి తలుపువైపు పోవును.)

వెంకన్న: (అక్కనుస్తుడి దుప్పటి పట్టుకులాగి) నేను చెప్పాతాను. చెప్పాతాను.

అక్కా: (తిరిగి చూస్తుని) అయితే చెప్పండి!

వెంకన్న: యెవరితో చెప్పనుగద?

అక్కా: యేమిటా మహారహస్యం!

వెంకన్న: చెప్పనుగద? యింగో! పార్వతి రాత్రి పడుకుంటే మెల్లిగా లేపి మయిలబట్టతో అట్లు తినమంది

అక్కా: యిదా రహస్యం; మైలబట్టతో యెందుకు తిన్నావు!

వెంకన్న: (తల గోక్కుంటూ) పొడుంకొట్టు పెట్టుకోవడానికి పదిరూపాయీలు యిస్తానంది.

అక్కా: మరేమి! నీ రొట్టె నేతిలో పడ్డది.

వెంక: నెయ్యి లేదు; వొట్టి రొట్టలే పెట్టింది.

అక్కా: యిదేనా కొంప మునగడం?

వెంక: తను కొరికిన యెంగిలి రొట్టెముక్క తినమన్నది.

అక్కా: (నవ్వి) తిన్నావ?

వెంక: తిన్నాను.

అక్కా: (నవ్వు పట్టలేక మిక్కిలిగా నవ్వుతూ) రూపాయిలిచ్చిందా!

వెంక: యిచ్చింది...యిచ్చీ...యిచ్చీ...

అక్కా : యిచ్చి యేం చేసింది ?

వెంక : మీదపడి కౌగలించుకుంది. "వెధవముండా!" అని తోసేసి అరుగుమీద వచ్చిపడుకున్నాను. ఆయింతా చీపురు గట్ట పట్టుకువచ్చి వీపు పెట్లగొట్టింది. దాంతో మీదగ్గరకు పారిపోవచ్చినాను.

అక్కా : (నవ్వు పట్టలేక దొర్లును)

వెంక : యెందుకు నవ్వుతారేమిటి ?

అక్కా : నవ్వక యేడవమన్నావ యేమిటి ?

వెంక : నేనుకూడా నవ్వనా ?

అక్కా : అడిగి నవ్వుతారా యేమిటి ? నవ్వు ?

వెంక : (నవ్వును)

అక్కా : అయితే యిప్పుడు యేంచేస్తావు ?

వెంక : యేం చెయ్యమంటారు ?

అక్కా : తిన్నగా వెళ్ళి అరుగుమీద పడుకో !

వెంక : చీపురుకట్ట ముతకది.

అక్కా : సిహ్కారణం దెబ్బలుతిండం యెందుకు? పార్వతి చెప్పి నట్టు చెయ్యి !

వెంక : వెధవతో సంగమం చెయ్యమంటావయ్యా !

అక్కా : నీ పింత్రండ్రికంటె నువ్వు గొప్పవాడివా యేమిటి ? ఆయన యెన్నో పాడుదేవాలయాలు ప్రతిష్ఠచేశాడు.

వెంక : మాతండ్రి మహాయోగ్యుడు. అయ్యపేరు చెడగొట్టు తానా ?

ఆక్కా: హాస్యాని కన్నాను. బహుధర్మంగా ప్రవర్తించావు. నిన్ను చూచి మీ చినబాబు బుద్ధి తెచ్చుకోవాలి. నీవు వేలలో యెన్నికైన మనిషివి. గాని రేపటినుంచీ యెలా కాలక్షేపం చేస్తావు?

వెంక: మధూకరం.

అక్కా: నేస్తం! నేను వుండగా నీకా అవస్థ రానిస్తానా? ఆ పదిరూపాయలు యేంచేస్తావు?

వెంక: పార్వతికి పంపించేస్తాను.

అక్కా: నేను యెంతమనువుపడితే అంతమనువు పెట్టిస్తాను. పొడుం కొట్టుపెట్టి, నీ కాలక్షేపము పోగా మనకి లాభం కూడా వస్తుంది.

[తెర]

## తృతీయ రంగము

[రామ్మూర్తి; చేతులు తాడుతో కట్టబడి పార్వతమ్మ ప్రవేశించును.]

రామ్మూర్తి: యిదేమిటి పార్వతీ?

పార్వతి: (కంట నీరొలుకుతూ వూరకుండును)

రామ: (దగ్గర చేరి కూర్చుని) యే దుర్మార్గులు కట్టారు నీ చేతులు?

పార్వతి: (మాట్లాడదు)

రామ: (వెంట్రుకలు సవరించి ముద్దుపెట్టుకొని చేతుల కట్లు విప్పి) యెవరు నీకీ అవస్థకి కారణభూతులు?

పార్వతి: వెంకడు!

రామ: వెధవను యెముకలు విరగదంతాను.

[ తెర ]

# చతుర్థరంగము

[పొడుం దుకాణం]

వెంకన్న: (పొడుంచేస్తూ ప్రవేశించును)

రామమూర్తి: యెందుకురా వెంకా చేతులు కట్టావు?

వెంక: యెప్పుడొచ్చావు రాముడూ? పరీక్ష ప్యాసయిందిరా?

రామ: దున్నపోతా! అడిగిన మాటకు జవాబు చెప్పవేమి?

వెంక: (పొడుంకర్ర పడవేసి నిర్ఘాంతపోయి చూచును) యెందుకురా రాముడూ యీ కోపం?

రామ: పార్వతి చేతులు కట్టినందుకు యిదిగో, పూనితీసి వో లెంపకాయ (కొట్టును.)

వెంక: (బుగ్గ తడుముకుంటూ) యెవర్రా కట్టారు పార్వతి చేతులు!

రామ: నువ్వు కట్టావని చెప్పింది!

వెంక: నేను కట్టానని చెప్పిందా వెధవముండ!

రామ: వెధవముండని దాన్ని తూల్నాడితే మరో లెంపకాయ తీస్తాను.

వెంక : సౌధవముండ కాకుంటే పునిస్త్రీముండనుమ ఛావురా! యీ మాటు లెంపకాయ తీస్తే ఆ ముండ విరిచేస్తాను. విన్నావ...ఒక దెబ్బకి మా రాముడివి కదా అని వూరుకున్నాను.

రామ : (నవ్వాయించి) అయితే నువ్వు కట్టకపోతే దాని చేతు లెవరు కట్టారు?

వెంక : అదేమో నాకేం తెల్సును. నెలరోజులాయి నేను యింటికే వెళ్ళలేదు.

రామ : (నూర్చుని ఆశ్చర్యములో) యెంచేతిరా? అబద్ధమాడిందా? అబద్ధమాడివుండదు......నే వినడం తప్పు కావచ్చును ...యెంచేతిరా నెలరోజులాయి ఇంటికి వెళ్ళలేదు?

వెంక : యెంచేతినంటే...చెప్పకుమా! పొడుంగొట్టు పెట్టుకున్నాను.

రామ : మా నాన్న గెంటేశాడా యేమిటి?

వెంక : మీ నాన్న నెలరోజులాయి వూళ్ళో లేడు.

రామ : సీమానాన్న నువ్వు బతకాలని బుద్ధిపుట్టిందా యేమిటి?

వెంక : అవున్నా! పొడుం మాబాగా తయారుచేస్తాను. మీతట్టు పొడుం యిలా వుంటుందిరా? ఒక పట్టు పీల్చు!

రామ : (పీల్చి) మాంచజాగా వుందిరా. యేం వేస్తా వేమిటి?

వెంక : యేం వేస్తానా? మజ్జిగపిక్క వేస్తాను...ఘుమఘుమ లాడుతుంది. ఒ పెద్ద పొట్లాం పుచ్చుకో.. నీకు యెప్పుడు కావలిస్తే అప్పుడో పొట్లాం యిస్తాన్నా.

రామ: వెంకన్నా! నువ్వు మంచివాడివిరా.

వెంక: నేను మంచివాణ్ణిరా?

రామ: అవును.

వెంక: మరి నన్నెందుకు కొట్టావు?

రామ: బుద్ధి తక్కువ చేత!

వెంక: మరెప్పుడూ కొట్టవుగద?

రామ: కొట్టను!

వెంక: రాముడు! నువ్వు మునసబు పనిచేస్తావుంటే నేను వచ్చి, "వోరే రాముడూ!" అని పిలుస్తాను. కోప్పడవు గద?

రామ: కోప్పడను...యింటికి వెళ్లిపోయిరా!

వెంక: అమ్మో...నేను రాన్రా.

రామ: యిన్నాళ్ళు అన్నదమ్ముల్లా వుండి...యిప్పుడు వేరుంటావురా?

వెంక: చీపురుగట్ట......(అని వీపు తడుముకొనును.)

రామ: నీ కేం ప్రాలుబ్ధం. చీపురుగట్టతో స్వయం యిల్లుతుడుచుకోవడం...వంట చేసుకోవడం; నాకేం మనస్కరించ లేదు.

వెంక: వోరీ రాముడూ! వంట ఓ ఎంత సొగసుగా చేస్తానూ!... చినబాబు దేశాంతరం వెళ్లితే నేనేగద వండుతాను. ఈ రాత్రి వుల్లిపాయల పులుసు చేస్తాను, వస్తావూ?

రామ: యెందుకు శ్రమపడతావు. నా మాట విని యింటికి వెళ్లిపోయిరా.

వెంక : యెంత డబ్బొస్తూందంటావంట...రెయిలు వచ్చినప్పు డల్లా అక్కాబత్తుడు పొట్లాలు పంపిస్తాడు. ఒక రూపాయి పొట్లాలు చెల్లుతాయి. నా పొడుం వున్న వూళ్ళ వాళ్ళు కొనుక్కుపోతారు. వర్తకులు కొట్టు యెత్తేశారు. ఒక రహస్యం విన్నావా?

రామ : రహస్యం యేమిట్రా!

వెంక : పొడుం పడక్షరని ఒక మహామంత్రం వుంది. కంసాలి గురువు వీరనాభాచార్యులు దగ్గిర ఉపదేశమయి పురశ్చరణ చేశాను......శిద్ధయింది.

రామ : నాకు చెపుతావురా ఆ మంత్రం?

వెంక : చెప్పుతే తల పేలిపోతుందిట.........గురువు చెప్పాడ్రా.

రామ : మంత్రా లబద్ధం. శ్రమపడి పురశ్చరణ చెయ్యకు.

వెంక : అదొక్కటే న్రా నీ దగ్గర దౌర్భాగ్యపుగుణం.......... తెల్లవాడి మాట నమ్మేసి మన గ్రంథాలన్నీ అబద్ధం అంటావు.........నాకు దాఖలాయిస్తే నే స్వప్నంలో మంత్ర దేవత నానాధర్మ భూషితురాలపుకుంభుమ్నా బంగారవు పొడుంకత్రతో వీపుమీద వేసింది. దాంతో తెలివొచ్చింది. మరి ఆవేళ నిద్రపోలేదు. నిద్రపొతే ఫలం పోతుందట.

రామ : పూర్ ఫూల్!

## పంచమ రంగము

[అక్కాబత్తుడు, వెంకన్న ప్రవేశించుచున్నారు]

అక్కాబత్తుడు : యేమిటి కబుర్లు ?

వెంకన్న : మా రాముడు పరీక్ష ప్యేసు అయినాడు. ఈవేళే పట్నంనుంచి వచ్చి వో లెంపకాయ తీశాడు.

అక్కా : యెందు కేమిటి ?

వెంక : పార్వతి చేతులు యెవడో కట్టాడుట.

అక్కా : యెవడో కట్టలేదు. వీధిగడపదగ్గిర నిలుచుని తోవంట పోయేవాళ్లని చూస్తూవుంటే, మీ మేన తత్తో ఖాయిదా పెట్టమని నే చెప్పాను. అంచేత చేతులు కట్టింది.

వెంక : మా మేనత్త కడితే రాముడు నన్నెందుకు కొట్టేడు ?

అక్కా : నీ సత్యకాలము చూసి. రామమూర్తికి గూబ కదలేశావు కావూ ?

వెంక : రాముణ్ణి కొడతానా ! వాడికి మునసబీ అయితే "వోరే రాముడూ" అని పిలుస్తాను. వాడికి పెళ్లిచేస్తాను.

అక్కా : నువ్వే చేస్తావూ ?

వెంక : (పొడుం పీల్చి) ఆ ! నేనే మా చిన్నాన్న వచ్చి నన్ను కాగలి చుకు యెత్తి యింటికి తీసుకుపోయినాడు. ఇవాళ నుంచి మా యింట్లోనే భోజనం. ష్టాంపు సంతకంచేసి వెయ్యిరూపాయిలు తెచ్చి మా మామ కిచ్చాను.

అక్కా : యెంత బుద్ధితక్కువపని చేశావు. నాతో చెప్పందీ యెందుకు సంతకం చేశావు.

వెంక: రాముడికి పెళ్లి చెయ్యవొద్దంటారా యేమిటి?

అక్కా: యంత పనిచేశావు! (ఆత్మగతం) దీని కేమిటి ప్రతీకారం? (ప్రకాశముగా) రెయిలుకి వేళయింది, పొట్లాలు పంపించు.

[తెర]

## షష్ఠమ రంగము

(రెయిల్వే స్టేషను. రెయిలు వచ్చినది. ఫస్టుక్లాసు బండిలో, [illegible] నైట్‌కాప్ ఫాయిజామా మొదలయిన పోషాక్ వేసుకుని త్రివిక్రమరావు పంతులు కిటికీలోనుంచి తొంగిచూచి "అన్లీఖాన్! అన్లీఖాన్!" అని నౌకర్ను పిలుచును. కొండుభట్టు ప్రవేశించును.)

కొండు: యే తాలూకా వారు వీరు! యే తాలూకా రాజా వారు వీరు! (అని దగ్గిరనున్నవార్ని అడుగును.)

దగ్గిరవున్నవారు: మాకు తెలియదు.

కొండు: (త్రివిక్రమరావు పంతులు గారి దగ్గిరకు వెళ్లి) ప్రభువువారు జాజినగరం జమీందారువా రనుకుంటాను.

త్రివిక్రమరావు: అలాగే నన్ను చూసి అంతా అనుకుంటారు. మేము తుమ్మలపాలెం మొఖాసాదార్లం. మాకు భూముల వల్ల పదిహేనువేలదాకా వస్తాయి.

కొండు: "నావిష్ణుః పృథ్వీపతిః" అన్నాడు. భూస్వాములు కాకపోతే రాజ వర్చస్సు యెలావస్తుంది. తమ నాయన గార్ని మా బాగా యెరుగుదు. నాయందు వారికి చాలా దయ. పిల్ల జమీందార్లన్నా, అఖండ అన్నప్రదాతలన్నా

ప్రభువువారు యిక్కడ దిగుతారా? పైకి విజయంచేస్తార? యిక్కడ దిగేట్టయితే మాయిల్లు చాలా విశాలంగా వుంటుంది. యేవిధమయిన యిబ్బందిన్నీ వుండదు. యీ గ్రామం గొప్పక్షేత్రం! పాండవ ప్రతిష్ట; కోదండరామ స్వామివారు స్వయం వ్యక్తం.

త్రివిక్రమ: మేము విలాసార్థం దేశం చూడామని విజయం చేస్తున్నాం. మీ గ్రామంలో చోద్యాలేమయినా వుంటే రెండు పూటలు గడుప అభిప్రాయం కద్దు.

కొండు: చోద్యాం అంటే పాతకోటకద్దు; సీతగుడ్డ కద్దు; స్వామి వారి ఉద్యానవనముకద్దు; అందులో మంటపము దేవ నిర్మాణం. దేవాలయం నౌఖరీచేసేవారు యాభయిళ్ళ భోగం వాళ్లు వున్నారు మంచివిద్యావంతులు, రూపవంతులున్నూ!

త్రివిక్రమ: అయితే యిక్కడ దిగుతాం.

కొండు: యేమర్రా ఓయి కళాసులూ!

త్రివిక్రమ: సాయిబు వున్నాడు. మీరు శ్రమపడకండి!

కొండు: సరాయిల పనా యేమిటి? తమపనికి నా కభ్యంతరం లేదు!

అల్లీఖాను: (ప్రవేశించి) సీకీ పైకీ చలో జీ.

కొండు: నేను సామాను అందిస్తాను నువ్వు బహార్ రఖో.

అల్లీ: నాకి బాత్ సకోజీ. సీకి సామాన్ మత్ పకడో.

కొండు: అమ్మోకతక్లీఫ్ నహీ (అని అటూయిటూ సామాను తీస్తూ పీనా, గళ్ళ'కులను ఉన్ని వేసును.)

అల్లీ: అరె బంచూత్ కామ్ కియా.

కొండు : అపరాధం, అపరాధం.

త్రివిక్రమ : అవి మనవి కావండి ! యెవడో దొంగ వాడివి ... పోయినాడు. (అని పూజారోగ్మని సాయిబుతో ...)

కొండు : నేను పరాయివాణ్ణి కాను ! శాస్త్రీయుణ్ణి, ... చారిత్ర్యవుణ్ణి. నాదగ్గర ప్రభువువారు అనుమాన పడ వద్దు. రండి ! ప్రభువువారు దయచేయండి ! సామాను వెనుకనుండి తీసుక వస్తారు.

(టిక్కెట్టు కలెక్టరు ప్రవేశించి కొండుభట్లు చరిత్ర ...)

టిక్కెట్టు కలెక్టరు : ఫస్టుక్లాసు బండిలోంచి దిగుతూవుండగా నేను కళ్లారా చూశాను.

కొండు : అది యెవర్ని చూసి నేననుకున్నావో ! వాండ్లమీద చెయివెయ్యక ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. నీమీద డామేజీదావా తెస్తాను. (కొండుభట్లు త్రివిక్రమరావుగారి వేపు తిరిగి) చిత్తగించరా ప్రభువ్వారు. ఈ మూర్ఖుడికి యింగ్లీషున నాలుగు చీవాట్లు రానియ్యండి. శ్రోత్రియుణ్ణైన బ్రాహ్మణ్ణి అమాంతంగా ముట్టుకుంటాడు ! తల పగిలిపోతు ది.

టిక్కెట్టుక : ఈ కబుర్లెందుకు పదండి స్టేషనుమేష్టరుదగ్గిరికి.

కొండు : పద, నాకేం భయమనుకున్నావ యేమిటి ! (త్రివిక్రమరావుపంతులుతో) యిప్పుడే వస్తాను. తాము వొక్కక్షణమాత్రం ప్రభువువారు కుర్చీమీద కూచోండి.

(గంగనారాయణులుశెట్టి తొందరగా ప్రవేశించి కొండుభట్లు చెవిలో యేమో చెప్పును. కొండుభట్లు ఆశ్చర్యపడును. ఇద్దరూ ప్రత్యేకము మాట్లాడెడమునకు ఒక ప్రక్కకు వెళ్ళిపోవును.)

టిక్కెట్టుక : యెక్కడికి వెళ్లుతావు. స్టేషన్ మేష్టరు దగ్గిరకి రా!

శెట్టి : ఏమి టీ అల్లరి ?

కొండు : నేను ఫస్టుక్లాసులో కూచున్నానని ప్రాణం పుచ్చుకుంటున్నాడు.

శెట్టి : యెబ్బ! బాపనోళ్ళమీదే నీ ఝూంకారమంతాను. యిదుగో! సుట్టముక్కలకి (అని ఒక అణా చేతిలో పెట్టును.)

కొండు : కొంప మునిగింది! హటాత్తుగా చచ్చింది ముండ! యింత వేగం చస్తుందని నే నెరుగను. లేకుంటే వూరుదాటుదునా ? అయితే మంజువాణిని యెవరయినా ఆదుకున్నారా? ఆమెకు యెవరు భరాసా యిస్తున్నారు.......నువ్వు వెళ్ళావుకావు.

శెట్టి : అంతా రత్నాంగే... మరెవరు ? నేను వెళితే కత్తి పట్టుకు వెంటతరుముతుంది.

కొండు : అయితే మన కేం చెయిజిక్కదు కాబోలు.

శెట్టి : సిక్కకేం! మీరు బేగెళ్ళి సుళువు చెయ్యాలండి.

కొండు : యేం సుళువు చెయ్యడం ? బుద్ధిమాల్ని వెధవని, నాలుగురాళ్ళకి ఆశపడి రామసానికి అంత జబ్బుగా వున్నప్పుడు వూరు విడిచి వెళ్ళేను.

శెట్టి : బుద్ధికెక్కువకు లెంపలాయించుకొని బేగెళ్ళి కథ యెలా వుందో కనిపెట్టండి.

కొండు : సరేగాని ప్రొద్దుపోతూంది. నువ్వు ముందు వెళ్ళి పెరటిగుమ్మం దగ్గిర వుండు. నే నిప్పుడే ఆ బోడిపంతులుని బసకు దిగబెట్టివచ్చి కలుసుకుంటాను ... (త్రివిక్రమరావు

దగ్గర వెళ్ళి) ప్రభువువారు దయచెయ్యాలి. ... ... ... ఏమేదిరా గుఱ్ఱబ్బండీ. తీసుకురా బట్కా ! ప్రభువ్వారి హోదాకి తగినది కాదు కాని, ఆ చేలుడున్నాడ శ్రీకృష్ణ మూర్తివారు విజయంచేసినట్టు అనుగ్రహించాలి ! ... ... సాయిబూ ! మాబసకి పోనియ్యి, యీ సామాను పట్టించుకుని నా కర్ణంతో కూడా నేను వస్తాను.

వెంకటస్వామి : నా గాజుసామానుకు వేరేబండి కావాలి.

కొండు : ఈ బండీ నీకు.

అచ్చన్న : నా లాంతరుకీ కొవ్వొత్తులకీ వేరేబండి కావాలి.

కొండు : ఈ బండీ నీకు.

అల్లీఖాను : పంతులుగారి పాలక్కీకీ, లేహ్యం డబ్బాకి వేరే బండీ కావాలి.

కొండు : ఈ బండీ నీకు.

అల్లీఖాను : పంతులుగారి పోషక్కుకు వేరేబండీ కావాలి.

కొండు : ఈ బండీ నీకు.

బుచ్చన్న : వంటసామానుకి ఒకబండి కావాలి.

పాపన్న : ప్రత్యేకం నా కొకబండీ మామూలు.

కొండు : మరి లేవు; పొండి !

పాపన్న : స్నేహితుణ్ణి, ఆశ్రితుణ్ణి.

కొండు : మరి లేవు బళ్ళు; ఒక్కొక్కరే వో బండీ యెక్కి వాళ్ళు వుడాయించారు.

బుచ్చన్న : అయితే యివాళ పంతులుగారు పస్తుపడుకోవాలి.

కొండు : నడిచి వెళ్ళిపోదాం; మరి బళ్ళు దొరకవు.

బుచ్చన్న : సామీా నెవడు మోస్తాడు ?

కొండు : కూలివాడు వొహడూ కనపడ్డూ; మనమే మోసుకు పోవాలి.

పాపన్న : మనం తిమ్మగం... ఆ పప్పుడకదు ! నేను వొకట్ట వస్తువయ్యా పట్టుకోను.

బుచ్చన్న : దొబ్బి తిని, భంగు తాగి పంతులితో మజా ఉడాయించడానికినువ్వూను, అరవచాకిరీ చెయ్యడానికినేనూ నా !

పాపన్న : బ్రహ్మదేవుడు నీ కలారాశాడు; నా కిలారాశాడు; కావలిస్తే బ్రహ్మదేవుడితో వెళ్ళి ఫిర్యాద్ చేసుకో. శాస్తుల్లుగారు ! యీావూళ్ళో డాన్సుకథ యేమయ్యా వున్నదా యేమిటి ? లేకుంటే పంతులు పడడు !

కొండు : యీా దేవాలయం నౌకర్లలో మంజువాణి సాక్షాత్తు రంభావతారం, వుంది.

పాప : యెవరయ్యా వుంచుకున్నారా ?

కొండు: నరహరిరావని వొక పంతులు వుంచుకున్నాడు.

పాప : అయితే మా పంతులికి అవకాశం యెలాగ ?

కొండు : నేను కొంచము వైద్యముకూడా చేస్తాను పంతులికి పైత్యాధికం పోవడానికి అప్పటప్పట విరోచనసాధనం చేస్తాను. దాంతో మూాడునాలుగు రోజులు మంజువాణికి ఆట విడుపు కలుగుతూా వుంటుంది.

బుచ్చన్న : నువ్వు పాతరసామాను పట్టుకుంటే, నే దినన్ను పట్టుకుంటాను.

4

కొండు: నా ప్రారబ్ధం కాలితే నా స్వగ్రామంలో మాటలు మొయ్యమంటావు.

బుచ్చన్న: అంత పౌరుషముంటే పదికి నీవాల్లాణ్ణే చూసి డన్నయ్యా తీసుకురా.

( తెర )

## సప్తమ రంగము

[మంజువాణి పెరటి యింట్లో గది. గదిలో ఒకవైపు పెద్ద పాత పందిరి మంచము, ఒక మూలకు ఒక పాతబీరువా పెట్టె, గోడవైపు రెండు పెద్ద జాడీలు, గోడకు బల్లలపీటలు, వాటిపైన బొమ్మలు, పాతపటాలు, పందిరిమంచం క్రింద యిత్తడి సామానులు, చింకిరిచాపల, కొంచము మాసిన బట్టలతో రత్నాంగి, దువ్వని జుత్తు, తగుమాత్రం అలంకారం, కావిరంగుచీరతో మంజువాణి, ఒక జాడీకి యీ ప్రక్క నొకరు, ఆ ప్రక్క నొకరు నిలిచివుందురు. రత్నాంగి చేతిలో ఒక వెలుగుతూవున్న కొవ్వొత్తి; జాడీదగ్గర ఒక చెక్కపీటపైని బంగారపు సరుకులు. మరి ఒక పీటమీద వెండిసామాను, ఒక వేపు బట్టల మూట.]

రత్నాంగి: (కొవ్వొత్తి వెలుతురిని జాడీ నాలుగుమూలలా చూపి, తల యెత్తి) యింతే! మరి లేదు! యేమనుకున్నావు? యిక పై ముప్పై వేలకు దేకురుతుంది. యింత గణించిందని యెవరూ యెన్నడూ అనుకోలేదు. బతికి నన్ను బాధపెడితే పెట్టింది కాని, చచ్చి నీకు కనకాభిషేకం చేసింది. లోకంకోస మయినా కంట తడిబెట్టావు గావు?

మంజువాణి: చచ్చిందని సంతోషించుతూ కంట నీరుపెట్టడం యెలాగ?

రత్నాం : నవ్వులు, కన్నీళ్ళు భోగందానికి తలిచేటప్పటికి రావద్దా ?

మంజు : నేను భోగందాన్నా ?

రత్నాం : నాలుగేళ్ళు సానెరికంచేసి యింకా సంసార్నే అనుకుంటున్నావా ?

మంజు : నమ్మికసామిద్రోహముచేసి నన్ను అమ్మికొండుభట్లూ, డబ్బిచ్చికొని రామసానీ నాలుగేళ్లు యీ చెరలో పెట్టారు... దేవుడు యిన్నాళ్ళకి చెర వొదిల్చాడు! యీ డబ్బు నాకు యివ్వాలని ఆ పిశాచం యిచ్చిందాయేటి? యీడబ్బు నాకు దేవుడుయిచ్చాడు. నన్ను బెట్టి అది యెంత ఆర్జించింది? యిక స్వేచ్ఛగా బతుకుతాను.

రత్నాం : అనగా ?

మంజు : వొకరిబాధ లేకుండాను !

రత్నాం : యెవరి బాధ ?

మంజు : రామసాని బాధ వొదిలిపోయింది! యిక పంతులు బాధ !

రత్నాం : (జాడీలో సరుకులు వుంచడం మాని,నిలిచి)నామాట కొంచం వింటావా ?

మంజు : నీకంటె నామంచి కోరినవా రెవరున్నారు !

రత్నాం : అట్టి నమ్మకంవుంటే పదిరోజులకాలం పాతకోవనే జరగనియ్.

మంజు : అయితే నీయిష్టం.

రత్నాం: అలిసి వున్నావు. వెళ్ళి పడుకొని నిద్దుర తెచ్చుకో.

మంజు: అలాగే! గాని నిద్దర రావడం యెలాగ? యీ మంచం మీద యింకా పడుకుందేమో అని బితుకు వేస్తూంది... దెయ్యమైందేమో?

రత్నాం: చచ్చిన ఉత్తరక్షణం వెట్టికుక్కయి పుట్టివుంటుంది... మనుష్యుల్ని పీక్కుతినే పిసినిగొట్లకు అదే గతి – ఆంజనేయ దండకం చదువుకుంటూ పడుకో (మంజువాణిని కౌగిలించుకుని, జుత్తు సవరించి ముద్దుపెట్టుకుని) వెళ్ళు; పడుకో.

మంజు: నీకీ రాత్రి జాగరమేనా?

రత్నాం: లేకుంటే ప్రమాదంవుంది, డబ్బు పాపిష్టిది! యెవరికే దుర్వ్యాహాలు వున్నవో?

మంజు: వొకర్తివీ వుండడానికి భయంవేయదా?

రత్నా: బతికివున్నప్పుడు భయపడందానికి చచ్చింతరవాత భయపడుతానా? (మంజువాణి పైకి వెళ్ళును. రత్నాంగి తలుపుతీసి లాంతరు వెలిగించి తిరిగి చూచును. మూలనున్న పెద్ద జాడీనుంచి కొండుభట్లు లేచును. రత్నాంగి గుండెఝల్లుమని కొవ్వొత్తి జారవిడుచును. కొండుభట్లు వూరుకొమ్మని చేత్తో సంజ్ఞచేసును. రత్నాంగి కొవ్వొత్తి తిరిగి తీసుకుని కొండుభట్లు దగ్గరకు వెళ్ళును.)

కొండు: మంచియెత్తు యెత్తావు! నీఅంత బుద్ధిమంతురాలు లోకంలో లేదు!

రత్నాం: మీకంటేనా?

కొండు: అంచేతనే మన వుభయులం యిక్కడ కలిశాం.

రత్నాం: ఇన్నాళ్లూ యిటుకనపడితే అటు మొహంతిప్పేవారే!

కొండు: ఆ రాక్షసిముండ గ్రామసానికి నీపేరు చెబితే యిష్టం లేకపోయేది. మరి దాన్ని ఆశ్రయించుకు బతికే తీరేది కాదు. అంచేత నీకు యెడయెడంగా తిరిగేవాణ్ణి. కాని నీ చతురతా, నీ విద్యా, నీ ధర్మబుద్ధీ చదువుకున్నవాణ్ణి, నేను కానలేదనుకున్నావా?...... తెలవారేసరికి యీ సరుకులన్నీ కరగడానికి తగిన సాధనసామగ్రి సిద్ధంగావుంది. వొంతులు యేర్పర్చేయి. నన్నుమాత్రం కలుపుకున్నావంటే పోలీసు, గీలీసు నిన్ను ముట్టలేరు. మంజువాణి డబ్బువిలువ యెరగదు. మనం యెంత వుడాయించినా పోల్చలేదు. (రత్నాంగి భుజముమీద చెయివేసి) కొంచం ఆసరా ఇయ్యి. పైకిరావడం దండ ఘుడియపడుతుంది. కాళ్ళకి కొంచెం మేహవాతనొప్పులు. (రత్నాంగి, కొండుభొట్లు చెయి విదిల్చి సరుకులు జాడీలో పడవేయ నారంభించును.)

కొండు: సరుకులు జాడీలో పడవేస్తున్నావేమి?

రత్నాం: జాడీతోకూడా పట్టుకుపోవడానికి!

కొండు: జాడీ యెలా మోసుకెళ్ళడం?

రత్నాం: జాడీ మొయ్యడానికి మనుష్యు లున్నారు.

కొండు: యెందుకూ వృథాశ్రమ! నలుగురికీ తెలియడం! నా మాట విని యీ గావంచాగుడ్డలో కట్టు (గావంచా చుట్టచుట్టి రత్నాంగిపై విసురును.) నీకు యీ విద్యలో ప్రావీణ్యత తక్కువగా వున్నట్టు కనపడుతుంది.

రత్నాం: బంగారం యెవరు కరిగిస్తారు?

కొండు: యిదిగో మన......

రత్నాం: మన...యెవరు?

కొండు: యెవరయితే నేం? పేర్లెందుకు!

రత్నాం: నమ్మినట్టా? నమ్మనట్టా?

కొండు: కావలిస్తే నువ్వుకూడా దగ్గిరవుందుగాని.

రత్నాం: అయితే పేరు చెప్పరా?

కొండు: యేదీ! గ్రంధంలో దిగింతరువాత అసలు అవతారాలే దిగుతాయి! పేర్లతో యేంపని?

రత్నాం: అయితే పేరు చెప్పరా?

కొండు: నీ పుణ్యాం వుంటుంది. కొంచం ఆసరా ఇయ్యి. పైకివొచ్చి అన్ని సంగతులు చెబుతాను. నీటి తన్నా గొయ్యా బొద్దెంకలు చెడకరుస్తున్నాయి.

రత్నాం: బొద్దెంకలు కరవ్వు. కొంచం తాళండి; యీ జాడి పెట్టించి మళ్ళా వస్తాను. (తలుపుదగ్గరికి వెళ్ళి గడియలు తీయ నారంభించును.)

కొండు: అంతా నువ్వే అవుపోసనం పడతావు? కొంచం బ్రాహ్మడికి పారెయ్యకపోతే శ్రేయస్సుకాదు. ఆ ధనంలో మూడోవంతు నా మంత్రాంగంవల్ల రామసాని సంపాదించింది.

(రత్నాంగి తలుపు కొంచెంతీయును. కొండుభట్లు జాడీలోనికి తలదూర్చును.)

రత్నాం: ఆ తగాయిదా యేదో మంజువాణితో తీర్చుకోండి! పిలుస్తాను.

కొండు : (బుర్ర పైకెత్తి) అమాంతంగా చంపేస్తావా యేమిటి?

రత్నాం : అయితే పేరు చెప్పండి.

కొండు : చెప్పకపోతే యేం చేస్తావు?

రత్నాం : మంజువాణ్ణి పిలుస్తాను.

కొండు : నువ్వు కాకనేకాదంటే చెబుతానుకాని, కోరి లభించిన ధనం కాళ్ళని తన్నుకుపోవడమే?

రత్నాం : పేరు! పేరు!

కొండు : అయితే విను (పొడుంపీల్చి) అక్కాభత్తుడు!

రత్నాం : కంసాలాడి శ్రీరంగనీతులన్నీ వొట్టివేనా?

కొండు : మరేవిఁటనుకున్నావు! లోకమంతా అంతే. నీలాంటి ధనవోల్లని వెర్రికుల్లై ఎక్కడో వుంటాడు; నామాట విను.

రత్నాం : ముందు నామాట వింటే...ఆ తిరువాత నీ మాట ఆలోచిస్తాను.

కొండు : నీ చిత్తం నువ్వేమి చెబితే అది చేస్తాను.

రత్నాం : యీ గదిలోకి యెలా వచ్చావో చెప్పు.

కొండు : యేకవచనం ప్రయోగిస్తున్నా వేమిటి?...యక్ష ప్రశ్నలు అడుగుతున్నావు. నావంటి మంత్రవేత్తకి తలుపులూ గోడలూ ఒక అడ్డా?

రత్నాం : అయితే, ఆ మంత్రింవల్లే పైకి దాటు. యీ జాడీ పైనపెట్టించి పైనుండి తాళం వేస్తాను.

కొండు : గదిలో ప్రవేశించడానికి యేం బ్రహ్మవిద్య కావాలి! మారుతాళంపెట్టి తీశాను.

రత్నాం : ఏ మనిషి నీకు సాయం చేసింది ?

కొండు : నాకొకరి సాయంకూడా కావాలా ?

రత్నాం : పేరు ?

కొండు : చెప్పకపోతే ?

రత్నాం : పట్టి అప్పచెపతాం !

కొండు : పట్టి అప్పచెప్పితే ప్రాణత్యాగం చేస్తాను. బ్రహ్మహత్య నిన్ను చుట్టి చుట్టి శేషువులా చుట్టుకుంటుంది.

రత్నాం : అయితే చెప్పినమాటకి జవాబు చెప్పండి.

కొండు : పేరు కేంవుంది (పొరుంపేల్ప) అంకి !

రత్నాం : అబద్ధం !

కొండు : అయితే...పైడి !

రత్నాం : అబద్ధం !

కొండు : యెరిగి నన్నెందు కడుగుతావూ ?

రత్నాం : బ్రాహ్మడికుండే నీతి నీకు లేకపోయినా, దొంగకి వుండవలసిన నీతైనా నీకు వున్నందుకు అలరుతున్నాను.

కొండు : అయితే బ్రాహ్మణ్ణని దయదల్చి ప్రాణాల్తో వొదిలి వేస్తారా యేమిటే? నువ్వు ధర్మాతురాలివి ! యీా పుణ్యం కట్టుకుంటే, స్వర్గం యెదురుగా వస్తుంది ! కొంచెం ఆసరా ఇయ్యి. జాడీలోంచి పైకివచ్చి యీా దొంగముండా బొర్దొంకలబాధ వొదుల్చుకుంటాను.

రత్నాం : శిఖా, యజ్ఞోపవీతం యిక్కడ సమర్పించి మరీ పైకి రావాలి.

కొండు : అదేవిఁటది ?

రత్నాం : అలా నిలుచుండండి, చెబుతాను! (దగ్గరకు వెళ్ళి) ముందు, జంఝం, దర్భముడి వుంగరం యిలా ఇచ్చెయ్యి.

కొండు : (జంఝం తీసియిచ్చి,) యిదిగో జఝుం పోస దాఖలు చేసుకో! బ్రాహ్మడన్నవాడికి ప్రాణసమానమైన ధనం యిదే! అది నీపాలు చేశాను. అంతటితో వొదిలివేయి.

రత్నాం : వుంగరం యిలా ఇయ్యి.

కొండు: నువ్వు నీతిమంతురాలవని పేరుపడ్డావు. బ్రాహ్మణద్రవ్యం అపహరిస్తావా ? "అవిషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విష ముచ్యతే" అని నెయ్యినోళ్ళతో శాస్త్రకారుడు చెప్పాడు. చదువుకున్న బ్రాహ్మణ్ణి కొంచం చెయి తడిచేస్తావేమోఅని ఆశపడితే అసలుకే మోసం తెస్తున్నావేమిటె ?

రత్నాం : అధిక ప్రసంగం ఆలస్యానికి హేతువ! మన మాటలు విని ఎవరయ్నా వొస్తేగుట్టుబట్టబయలవుతుంది, . . వుంగరం!

కొండు : కానియ్యి ! నా వేలువుంగరం నీ మృదువైన వేలు అలంకరిస్తే కృతార్థత చెందుతుంది. (వుంగరం అందిచ్చును.)

రత్నాం : ఆ మాట బాగుంది ! (వుంగరం వేలునుంచుకుని) యిక శిఖ వుండిపోయింది. (తలవంచి ఒక నిమిషం కదలకుండా వుండి మొలలోంచి కత్తెరతీసి చూపించును.)

కొండు : (జుత్తు చేతపట్టుకుని) సిగకే తాళంపట్టావూ ? అది మాత్రం వొదిలీయ్. నీకు దాసుణ్ణై తిరుగుతాను. యెన్నడైనా నీ మాట గడువుదాటితే అప్పుడే యీ మర్యాద చేదువుగాని.

రత్నా : "శుభస్య శీఘ్రం" అన్నాడు.

కొండు : కేశఖండన వృత్తివానికి చెప్పినట్టు చెప్తున్నావు. యీ మాత్రం గడపవా ? ముందు నీకు యెంతో పనికి వస్తానుసుమా !

రత్నాం : అలాఅయితే కొస కొంచం కత్తిరించి వొదిలేస్తాను; అది మాత్రం తప్పదు !

కొండు : అయితే కానియి !

రత్నాం : (జుత్తు కత్తిరించును.)

కొండు : కొసేమిటి ! మొయ్యా కత్తిరించేశావు.

రత్నాం : వెంట్రుకలకేమిటి ! తరిగినకొద్దీ పెరుగుతాయి. బలువు తగ్గింది.

కొండు : యీ అవమానంతో నలుగుర్లో యెలా తలెత్తి తిరగడం ? దాని సిగ్గోసిన సిగపోతేపోయింది. కొంచం ఆసరా యిచ్చి పైకి లేవదియ్యి. కాళ్ళు కొంకర్లు పోయినాయి.

రత్నాం : మొదట యెలా దిగావు ?

కొండు : తలుపు తాళం రాగానే శరీరానికి యెక్కలేని లాఘవం వొచ్చి హనుమాన్లులా యెగిరి లోపలికి జారాను; గాని వొళ్ళు కొట్టుకుపోయింది !

రత్నాం : రాలేకపోతే అలాగే వుండు.

కొండు : యేం యిలాంటి కాఠిన్యం వహించావు ? (అంగములు చేతబట్టి ఊబుకప్రయత్నించగా జాడీ పగిలి కొండుభట్లు పెంకులమధ్య కూలబడును.) చంపావు! (రత్నాంగి కొంత కనికరముతో లేవదీయును.)

కొండు: వొళ్ళంతా గాయాలు తగిలాయిగాని, నీ కరస్పర్శ తగలగానే అమృత నిష్యందనంలాగ... (కుంటుతూ తలుపు వేపు నడుచును. తలుపుదగ్గర నిలచి ధనంవేపు చూసి) ధనం కాళ్ళ తన్నుకుపోతున్నావు. లేక నాతో వొంతుకూడ్డం యిష్టం లేదుగాబోలు. నామట్టుకు కొత్తసీరా పాతసీరాకూడా యేకంగా కొట్టుకుపోయినాయి. నా వుంగరం దొబ్బినం దుకు లేడా దేవుడు? (అంటూ తలుపు గడియను తీసును.)

రత్నాం: (తానుకూడా తలుపుదగ్గిరకి వెళ్ళి తలుపు తానే వేస్తూ) నిన్ను ఒకిట్లో పైకివొదిలి, నే గదిలో వున్నానంటే పైని గొళ్ళెం వేసి కొంపకగ్గిపెట్టగలవు. కనక నిన్ను వీధిలోకి సాగనంపి వీధితలుపు ఘడియవేస్తాను (గదిపైన గొళ్లెంవేసి కొండుభొట్టుతో పైకి వెళ్ళును.)

(బోనిచెట్టి తలుపుయెత్తి కోమటి రంగన్నసెట్టి పైకివచ్చి సరుకులు పరీక్షించి, అందులోంచి వుంగరాలుతీసి చేతిని పెట్టుకుని కొన్ని కాసులు మొలను దోపుకొనును. యింతట్లో రత్నాంగి కాళ్ళ చప్పుడవును. సెట్టి మంచంమీద పడుకుని దుప్పటీ తీసి కప్పుకొనును.)

రత్నాం: (తలుపుతీసి గదిలో ప్రవేశించి సరుకులవేపు చూసి కాసులు లెక్కచేసి) యేమి టీచిత్రం! కాసులు సగానికి సగం తగ్గి పోయినాయి? (నిలుచుని నాలుగుపైపులా చూసును. మంచంమీద మనిషి వుండడం చూసి గతుక్కుమని రెండడుగులు వెనక్కువేసి ఆంజనేయ దండకం పఠిస్తూ "శ్రీమన్మహా అంజనీగర్భ సంభూత సర్వబ్రహ్మచారీ, కపీంద్రాదివంద్యా కిరీటోజ్వలద్రత్న")

[రత్నాంగి దుప్పటీ ముసుగు తీస్తూంది. గాఢనిద్రలో వున్నట్టు సెట్టి కదలడు. రత్నాంగి బాగా మనిషిని నఖశిఖపర్యంతం పరీక్షించి మొల దగ్గిర చెయ్యిపెట్టును.]

శెట్టి : (తటాలున రత్నాంగి తలపట్టుకుని) దొరికావు మరొగ్గను... చెప్పు! అమ్మవారివా? అసిరమ్మవా? పీడవా? పిశాచానివా? ఆ! యేటీవాలకం? చెప్పు! నిశిరాత్రివేళ యిటొస్తావు అటొస్తావు...నీకేం! నేనాశ్శకవాఁ! పరాశ్శకవాఁ, వోలమ్మ! యిదియేవూరు! యేలోకం! నాకొంపలో నాపక్కమీద నేను పల్లక పడుకున్న ముండావాణ్ణి, అమాంతంగా యెత్తి తెచ్చి యిక్కడపడేసినావుగదా! గుండెలు బద్దలయి సవ్వనా? రామసానీ! నీకేటి కావాల? ఒక్కమాట చెప్పు! యేటపోతు కావాలా? నీరూపంచూస్తే నాకాభయం వేస్తున్నాది. కళ్లు మూసుకున్నాను. తల్లీ! రక్షించు!

రత్నాం : చదవవలస్ని పాఠంవంతా అయిందా, యింకా వుందా?

శెట్టి : అయితే మనిషివే? యెవరమ్మా నువ్వు! చెప్పి నా యిల్లు చేర్చు తల్లీ! మావాళ్లు బెంగపెట్టుకుంటారు— రత్నాంగివా? అయితే బతికాను. (నలుదిక్కులా పరికించి) యిది రామసాని చీకటిగది కాదుగద? పిశాచమై పీక్కు తింటూంది! నన్ను తెచ్చి పడేసినట్టే నిన్నూ తెచ్చి పడేసిందా యేమిటే? యిక్కడుంటే మన్ని చంపేసి పోగలదు! రా! పైకిపోయి మంత్రగాడి కాళ్ళట్టుకుని ప్రాణం బచాయించుకుందాం!

రత్నాం : తల వొదిలెయి!

శెట్టి : చూశావా నా సేతులు యెలా గజగజ వొణుకు

తున్నాయో ? భయంచేత వళ్ళు కంపం పట్టుకుంది. ... నావశవాఁ, చేతులు వొాదల్డానికి.

(రత్నాంగి పెట్టెలోనుంచి మొలవద్దకి చెయ్యి పోనిచ్చును)

శెట్టి : సెయ్యిమాత్రం మొలలోకి వెళనీయకు. దోపిడే ? సానిబుద్ధి పోతుందా ? పిశాచం పీక్కుతింటూవుంటే సర సానికి యాళా ?

రత్నాం : వేళాకోళం మాని మొలనున్న కాసులు అక్కడ పెట్టు.

శెట్టి : యీవాళకం శెట్టిదగ్గిర పనికిరాదు. (లేచి నిలబడి రత్నాంగిని దూరానికి తోసి తలుపువేపు జరుగును.)

రత్నాం : దొంగ ! దొంగ ! మంజువాణీ (అని కేక వేయును)

శెట్టి : నేనేం యెఱ్ఱికుట్టి బాపనాణ్ణనుకున్నావా యేమిటి ? పిలువు ! నీయిష్టంవచ్చినవాళ్ళని పిలువు. నాకు భయమనుకున్నావా (పెద్ద గొంతుతో) నన్ను యీ సీకటిగదిలోకి పిలిచి యీాబ గారం మనం పంచుకు దోబ్బుదామంటే నే నొప్పుతానా ? నీకాకావలిస్తే నువ్వుదోబ్బు. పోలీసోళ్లు పట్టుకున్నప్పుడు నువ్వడ్డుతావా ? రామసాని దెయ్యమై పీక పిసికితే నీడబ్బడ్డుతాదా ? (తలుపు దగ్గిరకి దాసీలు, మంజువాణీ, నరహరి రావు గారు వచ్చి తట్టుదురు.)

శెట్టి : నాయెత్తుధనంపోస్తే ఇలాంటి దొంగపని నేనుచెయ్యాను. యింత దోహావాఁ ! పాపము బద్దలై ఆకాశమంత పిడుగు నెత్తిమీాదపడదా ! నాచెయ్యి వొాదిలెయి, తలుపుతీసి నీ భవిష్యం నలుగురి యెదుట తీస్తాను.

రత్నాం: చేతులు పట్టువొదల్లు! యేంచెయ్యను?

నరహరి: (తలుపుమీద చేయి వేసి) యెవర్లోపల?

రత్నాం: శెట్టి.

మంజు: శెట్టా, యెలా వచ్చాడు?

శెట్టి: శెట్టి, యెలావొచ్చాడా? రత్నం రమ్మని ప్రాణా తింటే వచ్చాను! బంగారం నాకొంచేసి ఖరీదుకట్టాలి రమ్మంటే వొచ్చాను. దొంగపని చెయ్యాలనుంటే నేనొచ్చబడతానా? రామపాని సొమ్ము ఒక్క చిన్నకాసు ముట్టుకుంటే పిశాచై పీక పిసగదా? (తలుపుతమకు పైకిపోడానికి ప్రయత్నిస్తూ నా)

రత్నాం: పట్టుకోండి! మొల్లో కాసులు ముడుచుకుపోతున్నాడు? అవిగో, వుంగరాలతో పాటు...

శెట్టి: యేటీమనిషి యికారం, (రత్నాంగిమీదికి వంగి మొహంపెట్టి మొహంపెట్టి) నేం దొంగనా? నువ్వు దొంగవా? మా యింటా వంటా ఆ మాట లేదు. ఆ మాట మళ్ళీ అన్నావంటే చాలాదూరం యెళుతుంది. కోమటోళ్ళ! మా యిల్లంతా బంగారం! మా వొళ్ళంతా బంగారం!

నరహరి: శెట్టీ!

శెట్టి: సిత్తం బాబూ! పిశాచమంటే నాకు భయం, పోలీసోళ్ళంటే నాకు భయం — మరెవ్వళ్ళకీ లచ్చపెట్టను. (తిరిగి సాగి వెళతాడు.)

నరహరి: నిలబడు!

శెట్టి : (వెళ్ళిపోతూ) భోగందాని యింట్లో ఒక్క నిమిషం నిలబణ్ణు! అదంతా బాపనాళ్ళకు చెల్లుతుంది.

నరహరి : (పరిగెత్తి శెట్టి రెక్క పట్టుకొని నిలబెట్టి) కాసులు, వుంగరాలు పెట్టు.

శెట్టి : సెయిమ్మీటు సరసం మాత్రం సెయకండి. మాటొస్తుంది!

నరహరి : యిస్తావా? యివ్వవా?

శెట్టి : దోపిడే!

నరహరి : ఆహా!

శెట్టి : యివ్వకుంటే యేటిసేస్తావు?

నరహరి : పిలకూడదీస్తాను.

శెట్టి : గవను మెంటు బావుటా యెగుర్తుండగా యెవడు పిలకట్టుకు నేవాడు?

నరహరి : యిదుగో నేను (అని పిలకట్టుకుని వంచును.)

శెట్టి : బాబ్బాబు! మీ మాట కెప్పుడయినా గోవంటోడు అడ్డు సెప్పుతాడా? మీ శెలవు! బాపనోరికి బంగారం యిచ్చుకుంటే పుణ్ణెం కదా! పితాళ్ళు స్వర్గానికి పోరా? ముండకాసులు మళ్ళీ ఆర్జించుకుంటాను; పుచ్చుకోండి! (కాసులు పుచ్చుకుని నరహరి గావు జుత్తు వదలివేయును.)

నరహరి : దెబ్బకు దెయ్యం వెరుస్తుంది.

శెట్టి : బాబు! దెయ్యమంటే నాకు వొల్లమాల్నిభయిం! మరొగ్గెయ్యండి; యీకొంపలోంచి దాటిపోతే బతుకుతాను. (గడపదిగుతూండగా)

రత్నాం : వుంగరాలో ?

నరహరి : వుంగరాలిచ్చి మరీ వెళ్ళు !

శెట్టి : మీా శలవు ! మీా శలవు కద్దా ? (వుంగరాలు తీస్తూ రెండడుగులు ముందుకేసి పరిగెత్తి పారిపోవును.)

( తెర )

## అష్టమరంగము

(అక్కాభట్టుడి దుకాణం : అక్కాభట్టుడు, రామ్మూర్తి ప్రవేశించును.)

అక్కా : ఇక 'రామ్మూర్తి' అని పిలవకూడదు 'రామ్మూర్తి పంతులుగారు' అని పిలవాలి.

రామ : యేదో పెద్ద ఉద్యోగాలు అయినప్పుడుగదా అలా పిలవడం !

అక్కా : అందాకా మామూలుగా పిలవొచ్చునా ?

రామ : యేం చదువు ? యేం ఉద్యోగాలు ?

అక్కా : యేం ఆలా అంటున్నారు ?

రామ : మాతండ్రి సంగతి బాగుందికాదు, ఆయనకి మంచి స్నేహితులయినన్నీ మీలాంటివాళ్ళు కూడదని చెప్పరు.

అక్కా : ఆయన యే కూడనిపనీ చెయ్యలేదే ! యేదో ఉపాయంవల్ల పదిరాళ్ళ సొమ్ము ఆర్జించుకుని సంసారం గడుపుకుంటున్నాడు !

రామ: ఎవడో పోలంగిరాజును యీవేళ యింట్లో దింపి పార్వతిని వాడికి ఉపచారం చెయ్యమని అప్పచెప్పాడు. యీ దాక్షిన్యం చూశారా?

అశ్కా: "భార్యా రూపవతీ శత్రుః" అన్నాడు. మొగుడున్న పెళ్ళామే సొగసుగావుంటే పయివాళ్ళు కన్నేస్తారుగదా, ఖాయిదా లేకుంటే సొగసైన వితంతు చెడిపోవడమనగా యెంతసేపు?

రామ: మా తండ్రికి అలా గడ్డిపెట్టాదా?

అశ్కా: మీ తండ్రికి గడ్డిపెడితే గడ్డయ్యేది, గట్టయ్యేది నావుగా తినేస్తాడు. అయినా, ఆయన ప్రతిబంధకం మీ ప్రయత్నానికి అడ్డవుతుందా యేమిటి? పెళ్ళిమూర్తం యెప్పుడండి?

రామ: ఎవరి పెళ్ళండి?

అశ్కా: ఎవరి పెళ్ళనుకున్నారు?

రామ: నా పెళ్ళి.

అశ్కా: ఆ మాటే! మీ పెళ్ళి! పార్వతమ్మ పెళ్ళినీ!

రామ: (నిర్ఘాంతపోయి) యెవరు చెప్పారేమిటి?

అశ్కా: యెవరూ చెప్పలేదు ... ... మీ మాటలవల్లా మీ చర్యవల్లా ఊహించాను. మరేం భయపడకండి; అది మహామంచిపని మీ తండ్రి ఆదాలోవుంటే రత్నంలాంటిపిల్ల చెడిపోతుంది. యీమాట పాకేట్లోగా శీఘ్రంగా కానియ్యండి. నాచేతనయ్ను సహాయం చేస్తాను.

రామ : నిజంగాను ?

అక్కా : లింగంసాక్షి !

రామ : అయితే మా గురువు గిరీశంగార్ని తీసుకొస్తాను !

( తెర )

## నవమరంగము

(మంజువాణి ఇల్లు. ఒక బల్లచుట్టూ కుర్చీలు. బల్లమీద గళాసులు. విప్పిన సీసా; మంజువాణి మంచంమీదను, త్రివిక్రమరావు పంతులు యీజీ చెయిరుమీద మితిమీరి పడివుండును.)

కొండు : (చప్పుడు కాకుండా బొటకన వ్రేళ్ళమీద నడచివచ్చి త్రివిక్రమరావును కదిపి చూచును. తెలివిరాదు. ఆత్మగతం) జేబులో యేముందో. (చెయి జేబులో జొరిపి...మనీపర్సుతీసి...విప్పిచూచి) దీనిలో పెద్దకాసులు చాలా వున్నాయి. యివి వీరికి దక్కేవికావు. వివాహకార్యం కింద వినియోగపరిస్తే కొంత పుణ్యం అయ్నా వీరికి దక్కుతుంది. రెండు కాసులు మంజువాణికి యిచ్చేటందుకు యిందులోవుంచి యిదిగో మళ్ళీ జేబులో పడేస్తాను. కడంవి కాకితం పొట్లాంకట్టి కందులజాడీలో లోతుగా కప్పివేస్తాను (నిష్క్రమించును.)

త్రివిక్రమ : (నిద్రలో కాలు చాచగా సారాబుడ్డి నేలపడి చప్పుడవును. అంతట ఉలికిపడి లేచి మరివొక గళాసు పుచ్చుకుని) దీనికి డబ్బిచ్చి వెళుదాం ! ( జేబులో మనీపర్సు తీసిచూచి నిర్ఘాంతపోయి ) ఆ ! రెండేనా వున్నాయి, కడంవి యెవరు దొబ్బారు ? అది

మంచంమీాద వొళ్ళెరక్క- పడేవున్నది ! లేక నేను ఖర్చు పెట్టాన ! లేకుంటే నా నౌఖర్లు యెవరయినా చెవాయిం చేశారా ?...... యీా రెండుకాసులూ దీనికి యిచ్చేస్తే యింటికిజేరే సాధనమేమిటో ? ...... ఒకటే సాధనం కనబడుతూంది శాస్తుల్లు యింట్లో దాని శిగగోస్సి పాత్ర సామాను వొదిలివేసి సన్నంగా నలుగుకుం జారిపోయి తెల్లారగట్ల రెయిలులో విశాఖపట్నం జేసుకుంటె అక్కడ రుణం చేసుకోవచ్చును. ఎవడూ మేలుకుండలేదుగద ! (తలుపు మెల్లగాతీసి వెళ్ళిపోవును )

( తెర )



# కొండుభట్టీయము

## తృతీయాంకము

### ప్రథమరంగము

[కేశవరాయుడిగారి చదువుగది: కేశవరాయుడుగారు; దివాన్ బహద్దర్ రాజారాంగారు ప్రవేశించును.]

కేశవ: బహుకాలానికి! దయచేయండి!

రాజా: రిటయిరయ్యిన వాళ్ళం కామండీ, బ్రతుకుయొక్క సాయంకాలంలో దేవుడికి దేశానికి నౌఖరీ చెయ్యవలెననే అభిలాషకలిగి దైవారాధనా, గ్రంథకాలక్షేపంతో కాలం వెళ్ళబుచ్చుచున్నాను. భగవద్గీత ఆచార్యులవారి వ్యాఖ్యాన సహితంగా ఆంధ్రీకరించినానుకద! ఇప్పుడు ఉపనిషత్ భాష్యం తెనిగిస్తున్నాను. నాస్తికం ఇంగ్లీషు చదువుకున్న మనవారిలో యెక్కువగుచున్నది. పెద్దలు చిన్నలు కూడా అప్పటి ఐహికసుఖాలందు మగ్నచిత్తులయి వుండడమే కాని, "వాట్ యామ్ ఐ" "కోహం; నే నెవడను" నా దేవుని యడల నా యడల నాతోటిపాటి జంతువులయడల నా డ్యూటీ యేమిటి, "వేర్ యామై డ్రిఫ్టింగ్" నే నేత్రోవ జారుతున్నాను? అనే తలంపులు యేమి పాపమో కాని బుర్రలో జొరబడవు. ఆస్తికులయిన తాము ప్రధానోపాధ్యాయులై యుండుటను ఈపట్నమున బాలురు మాత్రము యితర పట్నములవారివలె కాక బుద్ధివంతులుగానున్నారు.

కేశవ: దయచేత నన్ను పొగడుచున్నారుగాని నేను యంతటివాడను, నే చేసే పనసగా యెంతటిది!

రాజా : మీవంటి సత్పురుషులకు వినయము సదాభూషణ మయ్యే వుండును. దేశమునముందునుండీయున్న పాపచింతా, ఆంగ్లేయ విద్యలవలన కలిగిన నాస్తికతా అనే మహా మిసిసిపి, మిసోరి ప్రవాహములకు బ్రహ్మసమాజమతమనేది పెద్ద ఆనకట్టువలె ఆచరిస్తున్నాది. బ్రహ్మసమాజము లోకములోనుండు మతము లన్నిటికన్నా కేవలమే; సవ బయినదే అయిననూ లోకమున అవస్థా భేదము, రుచిభేదము కలిగివుండుటచేత ఏజాయ మనుష్యులకు ఆజాయను జ్ఞానోత్పత్తి. ధర్మోపదేశమూ చేయడము విధి గనుక తాము తత్త్వమును బట్టి సూటిగాపోవు బుద్ధులకు బ్రహ్మమతోపదేశము చేయుచున్నారు. నేనంటిరో, హిందూమత గ్రంథములలో పురాణాదులు కేవల స్త్రీ పామరజన బోధక ప్రయోజనములుగా తెలియించి శాస్త్ర త్త్యులు గూడా వేయునోళ్ళ బాగడు భగవద్గీతాది మహా గ్రంథముల సాహాయ్యమున ఆర్యమతమునకు చిరకాల మావరించిన త్రుప్పును గడగి ఆచార్య నిర్దిష్టకర్మ, వేదాంత మార్గములను చదువరుల కంటికింపుగ గనపర్చ ప్రయత్నిస్తు న్నాను.

కేశవ : యేరీతినయినా నాస్తికతా పాపము యెడల భీతి, పుణ్యముయెడల ఆసక్తి కలుగచెయ్యడం యిప్పుడు మన దేశములో అత్యావశ్యకము లయినప్పటి మన వాళ్ళ అవివేకానికి మేర లేకుండా వున్నది.

రాజా : పార్డన్ మీ ! యేదో వక తెరహా అంటే ఇంచుక నేను తమ అభిప్రాయముతో భేదించవలసి వస్తుంది. క్షమించ

వలయును. యే రీతినైనా ఆస్తికత అంటే ... యిదిగో ఛండాలుడు, యెనుపోతును వేట వేసి మరిడమ్మకు పూజ చేస్తాడు. మనమునూ అట్టుల చేయగలమా ? సంఘములో పై అంతస్థులవారమైన మనము రేషనల్ రెలిజను కలిగి వుండవలెను. అట్టిమతము క్రమక్రమంగా క్రిందివారికి దిగును...సవబునే నేను పూజిస్తాను. థియాసఫిష్టు మతిమువలె పేడా బెల్లం కలిపి మనవాళ్ళు సంతోషించ డము కొరకు ప్రతి నగ్రమొర్రి వ్రాతకు సందర్భార్థము కల్పించడమూ, ప్రతి అవకతవక ఆచారముకు రహస్య సవబులు, గుణములు కల్పించడము... యేమంటారు? తాము అట్టి వెర్రిమాటలు నమ్మజాలరే!

కేశవ : నిజమే !

రాజా : అట్టి ప్రవర్తన కలవారితో రాజీలెల్లను యెట్లుపాటించ తరమనవేయును ? మత సంబంధమయ్ను అతిక్రిత ఆచర ణలో మనవాకిటలోనే కొండంత యిన్ కాన్‌సిస్టెన్సీవున్నది. చూడండి, నాయుడుగారూ! మన మాధవయ్యగారున్నారు. వారి యోగ్యత. ఆంధ్రపాండిత్యమూ, కవితా సామర్థ్యము మన దేశమునకెల్ల నలంకార భూషితములయి యున్నవే. వారు బ్రహ్మసమాజ మతిము నెన్నాళనుండియో అవలం బించి ఆ మతిమునకు, మొనగాండ్లయి వున్నారు. విధవా వివాహములు ఆచరించవలసి వచ్చినప్పుడు, రీజన్ కాగిన వారు బ్రహ్మసమాజముయొక్క మార్గము వదలి హిందూ శాస్త్రప్రకారం ఆచరిస్తారు. అది యేమనవచ్చును ?

కేశవ: నిజమే! గాని మాధవయ్యగారు సవబుమాటిన పని చేసినసూ మల్లించడము శక్యము గాదు కాని, తాము విధవా వివాహముడక ఫర్ గాని, యెగినెస్టు గాని వున్నట్టు కానరాదు! తనవంటి పండితులు ఆ రిఫారం విషయమయి చర్చించి యేదోవక నిశ్చయమును తీసుకువుండకపోతే...

రాజా: అన్ని పనులు అందరూ చెయ్యడము శక్యమా? మత సంస్కారము, అందులో సంబంధించిన గ్రంధరచనా, నా బ్రతుకుకు విధానములుగా నిర్ణయించుకు వున్నాను. చేయ వలసిన పనులు లోకములో మెండుకలవు. చేయుచేగానిన పని కాయశక్తుల జేయనగు. అందు విద్య అన్య వ్యాపార నిరోధి; జలస్ వైఫ్! ప్రస్తావన వశాత్తూ విధవా వివాహ ముల మాట అంటినిగాని, ఆ భారముగూడా వహించుటకు నా భుజములకు నైశాల్యము చాలదు. మాధవయ్య గారూ, తమలాంటివారూ పట్టియుండగా నా రిఫార్ముకు మరియొకరి సహాయ్య మావశ్యకము కాదు. గాని నా మనసునకు కలిగిన సందేహము నివారించుకో జాలక, మాధవయ్యగారి మతమునకు ఆచరణకుగల వైరుధ్యము తాము సమన్వయించ గలుగుదురని అడిగితిని.

కేశవ: రాత్రింబవళ్ళు నేనిదే ఆలోచించుతాను. వారు వినరు; యేమి చెయ్యను. నేకూడా మోరల్ కరేజ్ లేనివాడిలా లోకానికి కనపడుతున్నాను. నాశత్రువులు నన్ను తరుచుగా వెక్కిరిస్తూవుంటారు.

రాజా: మాధవయ్యగారు గొప్ప గ్రంథకర్తలు, సంఘ సంస్కార నిర్వాహకులు; వారికి మనమందరము పూజ

చేయువలసినదే! వారి పేరట చంద్రకాంతి శిలాప్రతిను నకటిక్ నిలపనగు; గాని తప్పుత్రోవను మనల నీక్ష్చకుపోయి హాస్యాస్పదులనుగా చేసినప్పుడు నేంగుున నేమి చేయును? పెళ్లి చేసుకునే కుర్రవాడు బ్రహ్మసమాజము స్థుడైనప్పుడు సమాజ మందిరములో సమాజ పద్ధతి ప్రకారం పెళ్ళి చేయించుదును. మాధవయ్యగారేమి చేయుదురు?

కేశవ: తమరిచ్చిన సలహా బాగావున్నది. సంఘసంస్కార సమాజమువారము చాలామందంతా బ్రహ్మసమాజము వారమే! మేము నలుగురమూ కలిసి మా మతప్రకారం వివాహము చెయ్యడమునకు నిశ్చయిస్తే మిగిలిన ముచ్చ కాయ ముగ్గురూ యేమి చెయ్యగలరు? అందులో మా స్కూలు కుర్రవాళ్ళు మా పక్షము వుంటారుకద! ఓట్లు మెజారిటీ యే మీటింగులోనగునా మాకే వస్తుంది! యిటుపైని మా నమ్మకముల ననుసరించి పనిచేసి చూస్తాము. థేంక్యూ వెరీ మచ్ ఫర్ ది ఎడ్వైస్!

రాజా: నేను ఎడ్వైసును యివ్వలేదు. ఇవ్వజాలినంతటి వాడిని కాను. రిఫారుముకుమయమై నేను తమకు ఎడ్వైసు యేల? ఈ హాంశము మన ప్రసంగములో ఉపమా నముగా తెచ్చినాను. దీని మాటకేమి, తాము సనబు ప్రకారం నడిచేటప్పుడు లోకం అంతా మీపక్షమువుంటారు. మనం అనుకుంటూవున్న ప్రస్తావన రెలిజన్ రేషనల్‌గా వుండకుంటే అన్య మతస్థులయొక్క, నాస్తికంయొక్క థో కాకు నిలవగలదా?

కేశవ: అవును.

రాజా: నేను యిప్పుడు తమ దర్శనానికి రావడము కారణ మేమిటంటే, తమతో ముచ్చటించడమనే సంతోష మలా వుండగా, ఆదివారం రోజున మా తోటలో నలుగురు స్నేహితులకి టీపార్టీ యిస్తాను. ఆహ్వానము చేయుటకు వచ్చితిని.

కేశవ: చీటీ వ్రాస్తే వస్తానే! నాకోసం యెంత శ్రమ తీసు కున్నారు?

రాజా: తాము‌ను చూడడపు ఆనందమో, తమతో ముచ్చ టించుటవలన కలుగు జ్ఞానోత్పత్తియో? గుడ్ బై! (షేక్ హాండ్స్ చేసుకొందురు.)

కేశవ: గుడ్ బై!

(తెర)

## ద్వితీయ రంగము

(దివాన్ బహద్దర్ రాజారాంగారి కచేరిగది: రాజారాంగారు, గంగాధరశాస్త్రి ప్రవేశించుచు.)

రాజారాం: ఈ పటుపటాటోపములో యెవరు గెలుస్తారంటారు?

శాస్త్రి: తాము దివాన్ బహద్దర్లు; మాధవ అయ్యగారు రావుబహద్దర్లు. ఇద్దరి తారతమ్యము కంపెనీవారు యెంచే వుంచారు. తాము సాత్త్వికనాములగు మంత్రులు. మాధ వయ్యగారిది వైదీకపురస్సా. అందులో వేగినాటి సన్యాసం.

ఆయన్నకు దేశాన్నిపట్టి అబ్బింది. గ్రంధాలయితే చాలా రాశారు.

రాజా: పండితులయిన మీరూ అలా అనడం ఆశ్చర్యముగా నున్నది. పిట్టకథలు, పిచికకథలు, తిట్లగ్రంథములంటారో ఇంగ్లీషులో సోలిడ్ బుక్ అంటారే, అనగా ఉద్గ్రంథము! అది మనము వ్రాస్తూన్నాము. మనభగవద్గీత ఆంధ్రభాషకు వజ్రకిరీటమని పేపరువాడు వ్రాశాడు ...... శైలిభేదం చూశారా? మాధవయ్యగారి వ్రాత ఊక! పేలపిండి! మాశైలి అలంకార భూయిష్ఠమై యుండును వాక్యములు నడక సంగీత గమనము ననుకరించును. పామర జనులకు ఉత్కృష్ట వస్తుగుణ గ్రహణం వుండదు; మన గ్రంథములు యెంతిసొగసుగా నచ్చొత్తించినను కొనువారు గానరారు. జమీందార్లు తమ యుద్యోగస్తుల మేలు కోరి కాపీ లధికముగాగొని, తాము వారికి పంచిపెట్టిన జమీందారీలు బాగగును. దేశములో జ్ఞానాభివృద్ధికి మార్గమగును. ఒక మారు వెళ్లి ఉద్యోగావస్థలో పూర్వపరిచితులయిన వారిని చూడవలె. యెక్కడయినా మంచి స స్థానంలో దివాన్గిరీకి కుదురుకుంటేనే కాని, అధికారంచేసే అలవాటుపోయి యేమీ తోచకుండా వున్నది.

గంగా: ప్రజలకి ఆ అదృష్టంపట్టాలికదా!

రాజా: దివాన్గిరీ చేస్తే చెన్నపట్టపువకీళ్ళతో పలుకుబడికూడా వుంటుంది. కౌన్సిలు మెంబరుపనికి సహాయభూతంగా వుంటాను. యీ జిల్లాలోనే కొంచెం ప్రజలని రంజింప

చెయ్యడానికి సంఘసంస్కారంలో మనంకూడా వేలు పెట్టి తేనేకాని, యిక్కడివాళ్ళు మనకు వోట్లు యివ్వరు.

(ప్రవేశం నౌఖరు)

నౌఖరు : గిరీశం పంతులుగారు వచ్చారు.

రాజా : రమ్మను ! (గంగాధరశాస్త్రితో) ఇతడు నా బాల్య స్నేహితులయిన యుగంధరరావుపంతులుగారి కుమారుడు. చిన్ననాటినుంచి యెరుగుదును. బి. ఏ. ప్యాసు అయినాడు. తండ్రి ఆర్జించిన ధనం పెట్టి బ్రతుకుతున్నాడు. ఇతనికి సంఘ సంస్కారమువారు కెప్టెనుఅంటారు. సాహసౌదార్యాలుగల మనిషి. కోటివిద్యలున్నాయి. నాటకాలాడుతాడు. పాడు తాడు. గారిడీ చేస్తాడు. దొర్లకి ఇతనంటేసరదా. తండ్రిచేసిన మొదటి వివాహంభార్య పోయింది. పిల్లలు లేరు. తిరిగి వివా హం లేదు చేసుకుంటేమరెవరయి నాపిల్లనుయిచ్చివుందురు. అర్ధరాత్రివేళ యెట్టునెప్పున పిలిచినా రెండువేలమంది వెనుక కూడుతారు. గుణయోగ్యతలున్నవిగాని. కొంచెం పెద్దపిన్న తారతమ్యంమరిచి హాస్యంసంగా మాట్లాడుతాడు. తుంటరి ...అతను వచ్చేసరికి పుస్తకం చదువుతూ వుందాము. "భీషాత్ వాతః పవతే భీషోదేతి సూర్యః భీషాదగ్ని శ్చేంద్రశ్చ"

గిరీశం : (ప్రవేశించి) ఆ స్వరాన్ని యెందుకు సాగదీస్తున్నారు. శాస్త్రుల్లుగారిచేత చదివించండి. మీరు అర్థం వ్రాయండి.

రాజా : (మెల్లిగా) డామిట్ ! అప్పుడే ఆరంభించాడు ! బి. ఏ.,

ఆభాషలో వ్యాసువినాడు. మా వాడికి సంస్కృతంలోనుంచి ప్రవేశం వుందండి. తండ్రి ఉపనిషత్తులుకూడా చెప్పించాడు.

గిరీశం : మా గ్రామములో ఒక కోమటుండేవాడు. ఆయన పురుషసూక్తం పారాయణచేస్తూ వుంటే నూతులో కప్పలు బుర్ర పైకెత్తి అరచేవి.

గంగా : మండూకప్లుతం ! వేదంలో స్వరంకూడా వుంది.

గిరీ : బ్రాహ్మలు సోమపానంచేసి వేదపారాయణచేస్తే తొలకరి కప్పల అరుపులా వుంటుందని ఋగ్వేదంలో ఉపమానం కల్పించారు. తొలకరివాన కురిసినతరవాత రాత్రివేళ కప్పలు మేళంగట్టి తరహాతరహాలుగా గానం చేస్తూవుంటే అది వొక ఆనందంగా వుంటుంది !

రాజా : సీరియస్ సబ్జక్టులోనయినా హాస్యం విడనాడజాలవు గదా రావుజీ !

గిరీ : మామగారు! గుడ్లగూబలా గాంభీర్యంగా కూర్చుంటాను; యేం శలవు ?

రాజా : ఉపనిషద్వాక్యము పరిసమాప్తిచేసి మాటాడు కుందాము... శాస్త్రులుగారు ! అబ్బీ ! నువ్వుకూడా విను, నీ బుద్ధిలో ఒరిజినాల్టీ వుంది. "భీషాస్మాత్ వాతః పవతే" అన్నాడు దేవునికి భయపడి వాయువు వీస్తుంది; సూర్యుడు ఉదయిస్తున్నాడు. అని యీ ప్రకారం చాలామంది తాత్పర్యం చెప్తూతారు. భయమనేది భగవంతునియందు, క్రౌర్యం కనపరుస్తుంది. భక్తివల్ల దేవతలు వారి వారి పనులు చేసినారంటే కొంత స్వారస్యంగా వుండును.

మా వాడు (గిరీశంవంక చూసి) భయంచేత చెయ్యగూంపే యేపనీ చెయ్యడు. 'భీ' అనే మాటకు మరియేదన్నా అర్థం చెప్పితే బాగుంటుంది. యూరోపియనులు వ్రాసిన డిక్షనరీలు చూదాం.

గంగా: నేనుకూడా యేకాక్షర నిఘంటు చూసి కొన్ని అర్థాలు మనవిచేసుకుంటాను.

గిరీ: నేను, ఒరిజినల్ అని మామగారు శలవిచ్చారు గనుక నేనో కొత్తఅర్థం చెప్పుతాను. "షా"మీద"ఖా" యెక్కిస్తే భిక్షాఅని అవుతుంది. ఆపైని అర్థం బహుసులభవుగావస్తుంది. గాలీ, సూర్యుడు వగయిరాలు ముష్టికోసం సంచారించాస్తా రని సమన్వయం అవుతుంది. "భిక్షా" అన్నది "భీ" అనే ధాతువులోనుంచి వచ్చిన పదంకాదు. అది యిండోఆర్యన్ మాట! 'వ', 'బ', యోరభేదః అన్న సూత్రప్రకారం యింగ్లీషులో "విష్" అనే మోస్తరుగా తేలింది విష్ అనగా యిచ్ఛ. ఇచ్ఛామాత్రం భోజనం. దేనికోసం ముష్టి అంటే భుక్తికోసం! "భుక్తి భిక్ష మీయవే" అని త్యాగ రాయలు పాడలేదా? లోకంలోకూడా మనం చూడమా! గవర్నమెంటువారు యింత భిక్ష పడేస్తేగదా మామగారి వంటి గొప్పగొప్ప ఉద్యోగస్తులు నౌఖరీ చేస్తారు.

గంగా: వేదంలో అక్షరాలు మార్చడానికి వీలు లేదండి.

గిరీ: అర్థము మార్చడానికి వీలుందండీ?

రాజా: శాస్త్రులుగారూ! మీకు తెలియదండీ. మా వాడు చెప్పింది చాలా సబబుగావుంది. ఈ వేళకి సమాప్తిచేతాం.

శాస్త్రులుగారు మనలోవారే. మనం స్వేచ్ఛగా మాటాడుకో వచ్చును. రావుజీ! నీ హాస్యరసమునకు కొంచం కళ్లెంపెట్టి ఒకఅంనిమిషం సీరియస్‌గావుంటే చాలాఒబ్లైజ్ అవుతాను.

గిరీ: మామగారి శెలవు శిరసావహించి గుడ్లగూబవలె బుద్ధిగా కూచుంటాను.

రాజా: యీ విధవావివాహం తాలూకు హికమత్తుయావత్తూ మీ కేశవ్రావుగారిచేతిలోవున్నదిగనుక, తూచాతప్పకుండా యీవత్తూ పరిసమాప్తి అగునని నమ్మకము నాకున్నది. నేను నిన్నటిదినం కేశవరావు నాయుడుగారితో మాట్లాడి నాను. మాధవయ్యగారివరకు చేయుచున్న శాస్త్రోక్త పద్ధతి త్రోసి బ్రహ్మసమాజమతప్రకారం యిటుపైని విధవా వివాహములు చేయించుటకు వారిని గట్టిగా ప్రోత్స హించాను. నీసహాయంకూడావుంటే పాగ్యాతమ్మవివాహం మన పట్టణంలో ఫస్టు. బ్రహ్మసమాజ విధానా రీతిగా వుంటుంది. చేసుకునే కుర్రవాడు బ్రహ్మసమాజ మతస్థుడు గనుక రేషనల్ కన్సమేషన్ అనేది మనము ప్రతిష్టించిన వారమగుదుము.

గిరీ: సందేహము లేమయ్యా అడుగవచ్చునా?

రాజా: అడగకపోతే యెటులను?

గిరీశం: ఇదివరకే వ్యవహారం జరిగిపోతూంది. నలుగురూ ఐకమత్యంగా రిఫారంపని చేసుకుపోతున్నారు. ఇప్పుడు నాయునిని లేవదీశారు. మాధవయ్యగారికి తానుపట్టిన కుందేటికి మూడేకాళ్లు. ఇప్పుడు మీరు చేసిన దోవాదం

వల్ల నా గుభయులు జుత్తూ జుత్తూ పట్టుకుంటారు. ఈ దేశంలో రిఫారము అమాంతం గా రెండుముక్కలవుతుంది. అదే నా అభిప్రాయం మామగారూ! శలవియ్యండి!

రాజా: (ఆత్మగతం) వీడు అసాధ్యస్పిండం. యితడి సహాయం లేనిదీ పని కాదు. మామ అని పిలవడం ఆరంభించాడు. యుగంధరావూ, నేనూ స్కూలులో చదువుకునే రోజులలో అన్నా, తమ్ముడూ అ. పిలుచుకునేవారము. ఎదిగిన పిల్లలు గల తండ్రులను మామా అని పిలిస్తే మనస్సుకు కించిత్తు అనుమానం తలుగుతుంది. యింట్లో చనువుగా తిరుగుతాడు వద్దంటే బాగుండదు. ఎంతటివాళ్లకైనా వీడిని చూస్తే సరదా. ప్రవర్తన చెడ్డదని విన లేదుగాని, వీడి నాటకాలు, గారడీ చూడకుండా పిల్లని ఖాయిదా పెట్టాలి. విధవపిల్లని మాత్రం యీ వూళ్లో వుంచితే మాటదక్కదు అన్నదగ్గరకు పంపించివేతాము.

గిరీ: మామగారు! యేమిటి ఆలోచిస్తున్నారు?

రాజా: మరేమీ లేదు, మీ నాయినే యీ వ్యవహారంలో ప్రవేశిస్తే నీవు హాస్యాలు అడ్డుమాని సహాయం చేతువు గద!

గిరీ: మా తండ్రి యే వ్యవహారంలో దిగినా ముందూ వెనకా చూడకుండా దిగేవాడు. తండ్రిగారు దిగినా నాకు తోచిన మాటలు చెప్పవలసినవాడనే.

రాజా: అయితే నీవంటి బుద్ధిమంతులు సంఘసంస్కారముకు మొనగాళ్లయి వుండిన్నీ బేసవబయిన మార్గాన్న పని

జరుగుతూ మనమంతా అన్యమతస్థులకు హాస్యాస్పదం కావడం నీకు మనస్కరించియున్నదా? పెళ్లాడే పుత్రవాడు బ్రహ్మసమాజ మతస్థుడైనప్పుడు హిందూ శాస్త్రోక్తంగా పెళ్ళి చెయ్యడం నీకు యుక్తమనే తోచిందా?

గిరీ: పెళ్ళికూతురిది యేమతమో ఆలోచించారా?

రాజా: మనలో స్త్రీలు అజ్ఞానులు; అస్వతంత్రులున్ను. వాళ్లకి "గతానుగతికోలోకః" అన్నట్టు ఆచరణేగాని మత మంటూ వకటున్నదీ? క్రమంగా ఆపిల్ల భర్త మతం అవలంబిస్తుంది; ఇన్‌యూంటిసిపేషన్, మనం అందులో చేర్చవచ్చును

గిరీ: కిరస్తానులు, తురకలూ, విధవావివాహం చేసుకుంటే హిందూసంఘసంస్కారానికి ఎంతలాభమో బ్రహ్మసమాజంవారు చేస్తే అంతేలాభము. యింతకంటే సవరలు, కోదులు, గదబలు మొదలయిన కొండజాతుల ఆచార ప్రకారం వివాహం కొంత వింతగానైనా వుంటుంది. దొరలు సంతోషించడంకద మీకు కావలసినది? కొండ జాతుల ఆచారాలంటే తెల్లవాళ్ళు చెవికోసుకుంటారు. పేపర్లలో వ్రాసినా చదవతగివుంటుంది

రాజా: (ఆత్మగతం) కర్ణపిశాచివున్నవాళ్ల దగ్గిర కాకీలుదాగవు. (ప్రకాశం) ఒక పాయింటు నీవు మరచిపోతున్నావు. హిందూ హిందూ అనేమాట తుడుపెట్టె సంఘసంస్కారమే ముఖ్యముగా ఆలోచించవలసి వుంటుంది. హిందూ అనే మాట చేర్చగానే మనఉద్యమములలాభము సంకుచితమవుతుంది. రాజకీయ వ్యవహారములలో అన్ని మతముల వారమూ కలు

స్తున్నామా లేదా? యౌవనవంతులైన విశంతువు బ్రతుకు సుఖరహితము కాకుండా వుండడము సంఘ సంస్కారము యొక్క ముఖ్యోద్దేశముగదా. యేమంత్రప్రకారం పెండ్లి చేసేనేమి? వారలు పెండ్లి చేసుకుని సుఖించుట, సంఘ సంస్కారము కాదా? బ్రహ్మసమాజ మతముకూడా హిందూమతము లలో నొకటని నా అభిప్రాయము. పుత్రప్రాయుడవు, కావలసినవాడవూగనుక, నీఆసరామీద కించిత్తు సంఘసంస్కార రూపకమైన లోకోపకారంలో దిగతలచితిని. నీకు యీ పద్ధతి ముకు యిష్టము లేనియెడల యింతటితో విరమిస్తాను.

గిరీ: (ఆత్మగతం) బాణం గురిదాటింది. మిగిలిపోకుండకూడదు. (ప్రకాశం) నేను చెయ్యబూనుకున్న సహాయము చేసి తీరుతాను. గిరీశం అన్నమాట తప్పినాడన్నమాట యీసర్కి పుట్టలేదు. భగవదనుగ్రహంవల్ల ముందయినా అలా అనుటకు అవకాశము కలగకూడదు. వధూవరులను యిక్కడకు తెచ్చి దిగపెడతాను. కాని మామగారు పెట్టుతూవున్న బ్రహ్మసమాజ హిందూ వివాహ విధాన ముల కలహంలో నేను చెయిచేసుకోజాలను. సబబు కావలిస్తే నా స్వానుభవమునుబట్టి చెప్తాను. ఎవడిమతం వాడికి సబబు. ఎదటివాడి మతం వాడికి బేసబబు. నిజమైన సబబు స్వర్గంలోవుంటే వుండవచ్చును. మనిషికి మనసే సబబు తత్వమాలోచిస్తే మనోవృత్తులు ముందు పరుగెత్తుతాయి. మాటకారి, సబబులు కలిపిస్తాడు. నిష్కల్మషమైన మనస్సు, అవ్యాజమయిన భూతదయా వుంటే యేమతమయినా సమ్మతమే.

రాజా: మామా! నీమాటలు లేబరింతుల్లా వినబడుతాయి. మాటలనుబట్టి నీ మతం పోల్చడం శక్యం కాకుండావుంది. ఒకమాటు శాస్త్రంలో కలగెత్తుతావు. మరి వకక్షణం శాస్త్రాలన్నీ తగలదోసి సవబుకోసం కత్తి తీస్తావు. నీ వెంటనే లోకంలో సవబు లేదంటావు!

గిరీ: నామతం నాకే పోల్చడానికి దుస్తరంగా వుందనుకుంటాను మతం పునాదివేసి కడదామనుకున్నాను కాబోలు మామగారు! యెండవేళ ఒకమతం, వెన్నెలవేళ ఒకమతం, కడుపు కాల్తూవున్నప్పుడు ఒకమతం, కడుపు నిండినప్పుడు ఒకమతం, అందులో అంబలి మతం, పప్పు నెయ్యిమతం, గోధుమరొట్టె మతం. మద్య మాంస మతం, యేరుకుతినే వాకపళ్ళ మతం, డబ్బిచ్చికొనే మామిడిపళ్ళ మతం, గడవడం గడవకపోవడాన్నిబట్టి అంతర్భేదాలు కలవు! అలిసివున్నప్పుడో మతం, ఒంటరిగావున్నప్పుడో మతం, అతివచెంతనున్నప్పుడో మతం! లంగరు లేని నావలాగ మతం మనస్సుయొక్క శరీరముయొక్క స్థితినిబట్టి చలిస్తూ వుంటుంది. కొన్ని స్థిరములు మాత్రం నాకు వున్నాయనుకుంటాను మనసుకు మాటకు విడాకులయినప్పుడు, మాటునున్న మాట మార్కెట్టులో పెట్టాలనే పట్టలేని ఉత్సాహం ఒకటి; సూదంటురాయిని యినుము అంటినట్లు మంచివాళ్ళు కనిపిస్తే వాళ్ళను ఆనుకొను స్వభావం రెండు; యెదిరించినవాడిమీద కయ్యానికి కాలుదువ్వడం మూడు; కష్టసాధ్యమైన పని తటస్థించి ఫలితం మంచిదని తోస్తే ముందు వెనుక చూడకుండా అందులో ఉరకడం

నాలుగు; లయిఫ్‌లో వ్రుండే చమత్కారాలు వెతుక్కుంటూ పోవడం అయిదు; తెమసంటే పెద్దల శెలవు ప్రకారం నడుచు కోడం ఆరో మతం. అక్కడికి షణ్మతాలు స్థాపనయినాయి. ఇన్ని మతాలు ఒక్కచోట గూడితే ఒక తెన్ను యెలా వెళతాయి ?

రాజా : అందుచేతనే లోకం నువ్వు చెప్పినట్టల్లా వింటారు. అటువంటి మనిషివి నాబోంట్లు చెప్పినట్లు వినడమనేది వాత్సల్యసూచకం. ఆమాత్రం ఆసరా ఇచ్చావనంటే నేనుకూడా సంఘసంస్కారానికి కించిత్ సహాయభూతుణ్ణి కాగలను. ప్రస్తుతాంశ మేమిటి ?

గిరీ : మీరు చేస్తానన్న ద్రవ్యసహాయము సెటిల్ కావలెను.

రాజా : గామ్మూర్తికి మూడువందలరూపాయలు యిస్తానన్నానే !

గిరీ : యెప్పుడు ?

రాజా : పెళ్ళిఅయిన తక్షణం !

గిరీ : బ్రహ్మసమాజమతప్రకారం వివాహం కాక శాస్త్రోక్తంగా అయితే ?

రాజా : బేసనబుగా అయిన పనిలో మనం సహాయభూతులం యెలా కాగలం ?

గిరీ : యేప్రకారం జరిగినాసరే, ఇప్పుడు ఆ సొమ్ము చేతులో పడితేనే ముందు పనిజరగడం; లేకుంటే యిక్కడితో సమాప్తి.

రాజా : హోస్డ టన్నెస్ ! యు కెన్ ట్రస్టు మీా టు వే.

గిరీ: ఇమీడియట్ పేమెంటు విల్ ఆబ్వియేటు ది నెససిటి ఫర్ ట్రస్టు; సమ్ మనీ హేజ్ టు గోయిన్ టు ది హేండ్స్ ఆఫ్ థైపర్టు పెర్సన్స్ ఇన్క్లూడింగ్ ది బ్రైడ్.

రాజా: కంసాలికూడానా?

గిరీ: లేదు!

రాజా: నీవు ప్రాజ్ఞుడవు? నీకు నేను బుద్ధి చెప్పవలసిన వాడిని కానుగాని, అనుభవాన్ని బట్టి చెప్తూతున్నాను. బ్రాహ్మణ సంఘసంస్కారంలో కంసాలివాడు అమాయకంగాను అనపేక్షగానూ కలుస్తాడంటే నమ్మవద్దు. యేదోవక ఘట్టి సామిద్రోహంచేసి మన పరువు తీస్తాడు.

గిరీ: నేను ఆ జాగ్రత్త పడగలను. అయినా జాగ్రత్త యీ వ్యవహారంలో అవసరంలేదు. మనం సంఘసంస్కారమని పీకడుమాట ఉపయోగించి, లోకాన్ని మారెడెత్తు పెరిగించామని సంతోషిస్తున్నాం. కంసాలి, బాపనోళ్లు కులం చెడుతున్నారుగదా అని ఆనందిస్తున్నాడు. అదిఒకటి మనకి సేఫ్సైడ్! మరిఒకటేమిటంటే రామ్మూర్తి పెత్తండ్రి కొడుకు వెంకన్న నివున్నాడు. వాడియందు కంసాలికి పుత్ర ప్రేమ ఆ వెంకన్నని చిన్నగా పెంచక వాడిపితు భూముల ఫలసాయంపెట్టి కొండుభొట్లు రామ్మూర్తికి ఇంగ్లీషు చదువు చెప్పించాడని, మరికొన్ని కారణాలచేత కొండుభొట్లు మీాద కోపం. తండ్రి రామ్మూర్తికి మేనరికం కుదిర్చి వుంచాడు. ఈ విధవా వివాహం అయినట్టయినా మేనరికం తప్పిపోతుంది. ఆ పిల్లని వెంకన్నకి పెళ్ళి చేయించాలని

అక్కా-భర్తుడు ప్రైరిచేస్తున్నాడు. గనుక భయపడ్డానికి అవసరం లేదనుకుంటాను......పెళ్లికి తర్వాతి మూడోరోజు రాత్రి యీపూరికి పదకొండు మైళ్ళ దూరమునవున్న చెరుకువాడ సత్రంలో దిగుతారు. అప్పట్లో మీ గుర్రబ్బండీ సరంజాం పెరటి గొబ్బరికోటలోవుంచి యీ కంసాలి హీరక మత్ మీద వధూవరులను దాల్లోయెక్కించి రాత్రి వుండగానే తమ యింట్లో పెట్టాలి.

రాజా : కొంపతీసి మా యింటికే ?

గంగా : (ఆత్మగతం) అమ్మగారు, పంతులుగారికి, వధూవరులకు కూడా గోమయోదక స్నానం చీపురుగట్ట ప్రయోగంచేత ఉచ్చాటన వెంటనే చేస్తారు.

గిరీ : మీరు పబ్లీకుకు రాకూడదో ? మామగారు యింతపిరికి అని నేను అనుకోలేదు !

రాజా : పిరికి కనమా ? యుద్ధానికి వెళ్ళమంటే వెళ్ళుతాను. సమయోచితమయిన జాగ్రత్తను పిరికితన మంటారా ? కుర్రవాళ్ళబుద్ధి మిలమిల పరుగెత్తుతుంది. ముసలిబుర్రలు కొంచెం పస్తాయిస్తాయి. కార్యం సానుకూలం అయ్యేవరకూ పైకి రాకూడదు, వకటి; రెండవది, నా సహాయం కావలసినదిగాని, నాపేరు గొప్పకావడం నేను విరువగా యెంచను. మూడవది, మావంటివాళ్లం సంఘంలోవుండి, మీ అభిప్రాయములను వ్యాపింపజేస్తే లాభంగాని, అంతా యేటోదిగితే లాభం లేదు కొంతమంది మనవాళ్లనపించుకున్నవాళ్లం గట్టుమీదవుంటే మనకే లాభం !

గిరీ: దానిపేరు ఇంగ్లీషులో క్లైమ్ సర్వింగు అంటారు.

రాజా: మంచి అభిప్రాయములకు చెడ్డపేరు మహాసులభంగా యిస్తావు.

గిరీ: వధూవరులను మా యింట్లో పెట్టనా!

రాజా: (ఆత్మగతం) యితనియింట్లో పెడితే బట్టబయలౌతుంది. నలుగురూచేరి అంతా క్రెడిట్ కోసం దేవులాడితే మన క్రెడిట్ సన్నగిల్లుతుంది. (ప్రకాశం) మీ యిల్లు సత్రవు. అక్కడ యేంజేసినా చిదంబరరహస్యం. ఈ వ్యవహారం మట్టుకు పెళ్ళిపీటలమీద... లేదు కుర్చీలమీద కూర్చునే వరకూ వధూవరులు ఫలానావారని ఎవరికీన్నీ తెలియకూడదు. బ్రహ్మసమాజమతంప్రకారం పెళ్లి కానడముకు ప్రయత్నం నేను చేసుకుంటాను. ఏదో ఒక విధవావివాహం సిద్ధమైనదని నాయుడుగారితో చెప్పుతాను; గాని పేరు చెప్పను తెలిసిందా? బ్రహ్మసమాజపద్ధతివల్ల మరి ఒక ఉపయోగం కనిపెట్టాను. శాస్త్రప్రకారం అయితే మంచిముహూర్తం కనిపెట్టి పెళ్లి చెయ్యాలి. మంచిముహూర్తందాకా వితంతువుని దాచవుంచడం దుర్లభం. ఈలోగా బంధువులవల్ల చాలా తొందర కలుగుతుంది. బ్రహ్మసమాజం ప్రకారమయితే పిల్ల వచ్చిన మర్నాడు సాయంత్రమే పెళ్ళి చేసి వేయవచ్చును. నాకు తోచిన సలహా యేమిటంటే, మా బగీచాలో వధూవరులను ఆ రాత్రి పెట్టి.....

గిరీ: బాగుంది! రూపాయిలో?

రాజా: యివిగో! (పెట్టెతీసి రూపాయి లిచ్చును)

గిరీ: థేంక్స్. (నిష్క్రమించును)

గంగా: (ఆత్మగతం) గాడిదకొడుకు! యిన్నాళ్ళు ఆశ్రయించాను. నాకు నెంకె యేడురాళ్ళు యిచ్చేటప్పటికి కళ్ళ నీళ్ళు పెడతాడు. యీ వెధవపెళ్ళికి మూడువందలు ఖర్చుపెడుతున్నాడు.

రాజా: శాస్త్రుల్లుగారూ! యీసంగతి మనవాళ్ళకి తెలియనీకండి. మీరు చెప్పాలి, నేను చెప్పాలి, మరి యెవరూ చెప్పరు.

గంగా: "షట్కర్ణోభిద్యతే మంత్రః" అన్నాడు.

రాజా: గిరీశం చెప్పాడు. లోగిట్లో వాళ్ళు ఆసమయంలో వుంటే మట్టుకు ఆబోరు దక్కదు. వాళ్ళు పుట్టింటికి పంపించమని సంవత్సరమై తొందర చేస్తున్నారు. ముహూర్తం ఈలోగానే కుదిర్చి, మీరు తీసుకుని వెళ్ళి దిగబెట్టండి!

గంగా: మీరు విధవావివాహాంలో కలుస్తే బహిష్కారం అవుతుందే!

రాజా: యింతేనా నా మంత్రశక్తి శాస్త్రుల్లుగారు? చూశారూ బ్రహ్మసమాజమతంప్రకారం పెళ్ళి అయితే మనంచేసే సహాయసంపత్తివల్ల బాధకంలేదు. పెళ్ళిసమయంలో వెళ్ళి టిఫెన్ పుచ్చుకున్నా, కిరస్తానులు, తురకలవద్దపుచ్చుకున్న శ్లేట్‌గాని అంతకన్న తిన్నా పట్టడానికి అవకాశం లేదు. క్షీరం కలిసినందువల్ల ద్రవ్యములు చండాల హస్తంలోనుంచి గ్రహించవచ్చును

గంగా: బోధపడ్డది!

[తెర]

## తృతీయరంగము

(కంసాలి దుకాణం: అక్కాభొట్లు, వెంకన్న ప్రవేశింతురు.)

అక్కా: వెంకన్నా! పంతులు చెడిపోతున్నాడు. దాని శొష్టలు బహుఅక్రమంగా వున్నాయి. మీ బాబు మంత్రాంగంవల యేవరు బాగుపడ్డారు?

వెంక: మా బాబు యేంచేశాడు?

అక్కా: యేం చెయ్యలేదు. సానిదానికి సరసుల్ని తార్చి డబ్బు సంపాదిస్తాడు. పంతులుకి రత్నంవంటి పతివ్రత అయిన భార్యావుండగా దీనిమాయలలో దింపేశాడు.

వెంక: పంతుల్ని మీరు బాగుచెయ్యరాదూ?

అక్కా: మీ బాబుమంత్రాంగంమీద మన బుద్ధు లెక్కవు. గాని పంతులు కంటిమసక వదలడానికి వకమందు చెప్తాను, చెయ్యి!

వెంక: నేను వద్యుణ్ణికాను.

అక్కా: మందనగా వుపాయము! ఈవేళ పంతులు తండ్రి తద్దినం. అంచేత మంజువాణియింటికి రాత్రి యీ సమయము చూసి కొండుభట్లు గొళ్ళసాయబుని మంజువాణి యింట్లో ప్రవేశపెట్టబోతున్నాడు. నువ్వు తిన్నగా వెళ్ళి యీమాట పంతులుగారితో చెప్పి పదకొండుఘంటల ప్రాంతాన పెరటిగోడ గెంతి అమాంతంగా లోపలికి వెళ్ళమను. నేను వీధిగుమ్మం తలుపు గొళ్ళెం పెట్టుతాను.

వెంక: తురకాడుంటే పంతులుకేమి?

అక్కా: చూస్తూగాని నీకే తెలుస్తుంది!

[తెర]

## చతుర్థరంగము

[మంజువాణి యిల్లు: మంచంమీద కూర్చుని, హుక్కా పీలుస్తూ సాహేబుగారు, కింద చాపమీద కూర్చొని కొండుభొట్లు]

సాహేబు: క్యా! దేర్ హోతా జీ!

కొండు: పోషక్ బనాతే మహారాజ్.

సాహే: రాత్ బొహుత్ హోగయి. థోడా వేదం బోలో జీ.

కొండు: (ఆత్మగతం) తురక వెధవ వేదం చదవమంటున్నాడు.

(ప్రకాశం) సాహేబుగారు వచ్చారు
మహాదొడ్డవారునై ।
మడదుక్కలాగ వున్నారు,
గొడ్డుమాంసము తిందురు ।
లెంపకాయ ఆచి కొట్టేను,
దవడపళ్లూడిపోవును ఇత్యమరః ।
సాహేబుగారు వచ్చారు,
మహాదొడ్డవారునై ।
మోటవా రేమిచేస్తారో
భయం వేయుచున్నది ।
గంజాయిపీల్చ మార్గాన,
వొళ్లు తెలియక యుందురో ఇత్యమరః ॥

దాసీ: (ప్రవేశించి కొండుభట్లు చెవిలో) సాయిబుకు తెనుగు వచ్చునా ?

కొండు: వక్క అక్షరం రాదు. రెండు నెలలు కాలేదు ఢిల్లీ నుంచి వచ్చాడు.

సాహే: ఢిల్లీ క్యా బోల్తే జీ.

కొండు: ఢిల్లీ బాద్షాకె ఆప్ భాయి బంధు కర్కె బోల్దియా.

సాహేబు: (లేచివచ్చి వెన్నుమీద గట్టిగా చరిచి) తు అచ్ఛా బామ్మన్ హై.

కొండు: చచ్చానురోయి నీ అమ్మశిగతరగా.

మంజు: (తెరవతలనుంచి) సాయిబుని నలిపొమ్మను. నధన కసాయివాడిలాగా వున్నాడు. తోళ్లవారన కొట్టుతున్నాడు.

సాహే: క్యా బోల్తే జీ?

కొండు: పేట్కో దరద్ హై కర్కె బోల్తే.

సాహే: ఝూటా బాత్, దగా కర్తేతో తుమ్కు మార్తె (అని ముష్టి యెత్తును)!

కొండు: వాణ్ణి పొమ్మన్నమాట
చెప్పజాలనునై ।
తురకః కరకశ్చైవ
ధ్యావేతా మలమోచకా ।
తురకాడు కరక్కాయ
పేరుచెప్తే విరేచనం ।
నీవు రాకుంటె వీణ్ణుంచి
యింటికి వెల్లిగానునై ।
జారిపోతాను లేకుంటే
నాకిక్క డాబోరు దక్కదు ।

సాహే: కంచన్ క్యా నై ఆతే జీ?

కొండు: అభీ ఆతే మహారాజ్!

మంజు : గదిలో కూచుని తలుపు గడియ వేసుకున్నాములే, నేనూ వెంకీని! సాయిబుని పైకి గెంటెయ్య; లేకుంటె వాడి చేతి తాపులు తిను !

కొండు : ధర్మంకాదిది మంజువాణీ వినుమా ! (శ్లోకం వలె చదువుతాడు.)

దాగుంట, ధైర్యంబు నీ
వవలంబించియు పైకివచ్చి మరియున్ ।
ప్రాణంబు దక్కించుమా
లేకుంటే నిలు దీపమార్పి మరియున్ ।
నీ కొంప కగ్గెట్టుదున్
నీవు నీ చెలికత్తెకూడ గదిలో
చిచ్చిట్ట చస్తారు సై॥

సాహే : బహుత్ అచ్ఛా గాతే జి (అని తిరిగి కొండుభట్లను తట్టును)

మంజు, వెంకి : యెవళ్ళరో వీధిలోను ? (అని గొంతెత్తి అరచును)

సాహే : క్యా గడ్‌బడ్ జీ ?

కొండు : యే ఘర్ మే ఏక్ బడా బ్రహ్మరాక్షసి కహాతే బడా బొమ్మన్ సైతాన్ హై.

సాహే : సైతాన్ గియితాన్ మార్డేతే (అని కర్ర సవరించును)

పంతులు : (గాల విగబోసుకుని చేతిలో లాఠీ పట్టుకుని కోపముతో)
ముండా ! మంజువాణి (అని తొందరగా ప్రవేశించును)
(కొండుభొట్లుని చూసి) వెధవ షకీరు వెధవ ! నువ్వుండేనా, ఈదార్జన్యంచే యుసున్నావు(అని కొండుభొట్లునుక ఱతో కొట్టును)

సాహే : యే హై బొమ్మన్ సైతాన్ ?

కొండు: హై మహరాజ్.

సాహే: (కర్రతో రెండుదెబ్బలు పంతుల్ని కొట్టేసరికి పంతులు [illegible] బడును).

కొండు: (వీధితలుపు [illegible] తియ్యబోతే రాదు) యెవడో తలుపు గొళ్ళెం వేశాడున్నోయి! పెరటితోవని సాహేబు అడ్డంగా తురకాడున్నాడు! యిక నేమి సాధనం (ఆలోచించి) దీపం ఆర్పేస్తే పంతులు పారిపోతాడు. (దీపం ఆర్పేసి సాహేబుమీద, పంతులుమీద చెంబుతో నీళ్ళు విసురును)

సాహే: అరే! బహుత్ బడా సైతాన్ హై. యహాసె చల్జానా (వీధితలుపు తియ్యబోగా రాదు. తలుపు బలాత్కారంగా తీసి వెళ్ళిపోవును).

(తెర)

## పంచమ రంగము

[అక్కాభట్టుడి యింటి అరుగు: హెూస్సన్న, కొండుభట్లు, అక్కాభట్టుడు ప్రవేశించును]

కొండు: సాయిబు పంతుల్ని చావగొట్టేడు.

అక్కా: యెక్కడ?

కొండు: మంజువాణి యింట్లో.

అక్కా: మీరు రెందుకున్నారక్కడ!

కొండు: పంతులుగారింట్లో ఆడవాళ్లకు పురాణం చెప్పి వస్తూండగా మంజువాణి యింట్లో గడబిడ అవుతూవుంటే తొంగిచూశాను.

అక్కా : అయితే యేం చెయ్యమంటారు ? కనిష్టీబుల్ని పిల్చుకువెళ్ళుదాం.

కొండు : వొద్దుబాబు ! లేనిపోని అల్లరిచెయ్యకండి ! తమరు దయచేస్తే చాలును.

అక్కా : తురకాడు నాకు దేహశుద్ధి చేస్తే ?

కొండు : వెళ్ళిపోయినాడు !

అక్కా : కొండుభొట్లుగారు ! లాంతరు తెండి, నేను చేతికఱ్ఱ పట్టుకువస్తాను.

[ తెర ]

## షష్టమరంగము

[పంతులు మంచమును జారబడి జాపోయియుండును; అక్కాభత్తుడు చేతికఱ్ఱయు, వెంకన్న, లాంతరును పట్టుకొని కొండుభొట్లు ప్రవేశించును]

అక్కా : యేమిటండి పంతులుగారు ?

పంతులు : ఏమీ లేదండి...... శాస్త్రుల్లూ ! వీడ్నెందుకు తీసుకొచ్చావు ?

కొండు : సాయిబు మళ్ళావస్తాడేమో అని భీతాహంచేత తీసుకొచ్చాను.

పంతులు : సాయిబు యింగువ అమ్మకానికికాదూ వచ్చాడు ?

కొండు : నెధవ అందుకే వచ్చానన్నాడు. (మెల్లిగా) నానివాళ్ళ మాయలు నాకేం తెలుసును.

అక్కా : ఎందుకట్టే చర్చ పంతులుంగారు! యిక్కడ వుంటారా? యింటికి వస్తారా ?

పంతులు : యిహెందుకు యిక్కడ ? యింటికి వెళ్ళిపోతాను !

మంజు : (పంతులు వెనకనుంచి ప్రవేశించి) అక్కాభక్తులుగారు మీరు వెళ్ళిపొండి !

పంతులు : (వణుకుతూ చేతికఱ్ఱ తీసి) ఆ యింగువమ్మ గొడవకోసమేనా యీ ముస్తాబంతా ? (అని కఱ్ఱతో మంజువాణిని కొట్టును)

అక్కా : (పంతులు కొఱ్ఱతో చెయ్యి పట్టుకుని) శాంతించండి పంతులుగారు !

మంజు : (చేతిలో కొఱడా లాగికొని కిందవేసి కుర్చీలో కూర్చొని) పంతులుగారు కాదు మీరు ! అమ్మవారు; ఆడవాళ్ళమీదికి శూరులు ! సాయిబు దగ్గిర లేకపోయింది పౌరుషం ! నేను వేశ్యను; నా వృత్తిధర్మం నే మానను; మీ యింటో వున్న సంసారి వేశ్యని ఖాయిదా పెట్టుకోండి !

పంతులు : యేమిటి పేలేవూ ! చూడు ! (అని వెనక్కులాగును)

కొండు : ఊఁ ! (ఊరుకోమ్మని మంజువాణికి సౌంజ్ఞ చేయును.)

మంజు : పంతులుకి యింకా గిటణాగలేదు. వెంకీ ! యిక్కడే వీధిలో వుంటాడు తీసుకురా.

వెంకన్న : పిలవమన్నావా యేమిటి ?

కొండు : నెధవాయి ! వూరుకోవోయి. సాయిబు మళ్ళీవస్తే చంపేస్తాడు. పంతులుగారు దయచెయ్యండి. (అని పంతులు చెయ్యిపట్టుకుని లాగును. పంతులు, కొండుభట్లు గుమ్మందాటుతూండగా చూచుచుండగా మంజువాణి పంతులు వీపుమీద ఒక దెబ్బ, తిరిగిచూచిన కొండుభట్లు వీపుమీద ఒక దెబ్బ వేసును.)

( తెర )

## సప్తమరంగము

[కొండుభట్లు యిల్లు అరుగుమీద బిచాణా పరుచుకుని కొండుభట్లు కూర్చుని వుంటాడు]

కొండు : (పాఠంపేన్చి) ఇవాళ యేమి ప్రమాదాలు వచ్చాయి. పంతులు కొట్టినదెబ్బకి బొటబొట రక్తం కారింది...గాడిద కొడుకు...నిద్దరపోతే తురకవాడు కల్లో వస్తాడేమో అని భయంగా వుంది. "రామం, స్కంధం, హానుమంతం, వైనతేయం, వృకోదరం, శయనే యస్స్మరేన్నిత్యం దుస్స్వప్నం తస్య నశ్యతి." (నలుదిక్కులా కలయజూచి ముసుకొనును.)

(ప్రవేశం : సాహేబు)

సాహే : ఉఠో జీ.

కొండు : (ఆశ్చర్యం) ఓర్నాయన సాయిబుకాబోలు !...... నిజమా కలా ?

సాహే : ఉఠో జీ (అని గట్టిగా వెన్నుమీద చరుచును.)

కొండు : (లేచి) చంపేశావు !

సాహే : కంచన్ ఘుర్కి ఫిర్ చల్నా ఆవ్.

కొండు : ఆహో...హోహో...హా...ఖుదా వంద్ కంచన్ ఘర్మే బడా బొమ్మన్ సైతాన్ హై హమ్ డర్తె.

సాహే : కూచ్ ఫర్వా నహీ. బొమ్మన్ సైతాన్‌కు మార్ దేఁగే.

కొండు : హమ్ బొమ్మన్ హై కంచన్‌ఘుర్కు చల్నా బొహుత్ దోష్ కర్కి అమారా శాస్త్రమే హై.

సాహే: తుమ్‌కు కోన్‌సి శిఖాయు?

కొండు: అమారె బాప్ శిఖాయు.

సాహే: అజ్‌తక్ ఆప్ కంచన్కా ఘర్ నై చెల్తే?

కొండు: కంచన్‌కు ఘర్కా కభీ నై జాయెంగ.

సాహే: అయిసా తో తుమారీ దేవత్ సే ప్రమాణ్ కరో.

కొండు: (ఆత్మగతం) ఘోరప్రమాణాలు చెయ్యమంటాడు. యవరికిశక్యం? కందులగూనలో కాసులు యెవడు వొదులు కోగలడు? వీధిలో చడి అవ్వుతూంది, ఓ కేక వేస్తునా!

సాహే: పుకార్ కరేతో గలా కాట్ దేంగే. (అని కొండును చేత్తో పట్టుకొనును)

కొండు: (ఆత్మగతం) మనస్సులోమాట మనస్సులో వుండగానే పోలుస్తాడు. మనిషి కాడు దెయ్యం అనుకుంటాను. (ప్రకాశం) యిదిగో! జందెం పకడ్కే శపథం కరేంగె! హాం కంచన్కా ఘర్కా నైజాయంగే. దేఖోజీడర్తె హామ్కా బుఖార్ ఆయ. (అని చెయ్యి చూపును.)

సాహే: అచ్ఛా! కభీ కంచెన్కా ఘర్కా జాయేతో గల్లా కాటేగా. (అని నిష్క్రమించును.)

కొండు: చలివొణుకూ వచ్చాయిరా బాబూ! ...పార్వతీ! కుంపటి తేవే! కుంపటి కుంపటి కుంపటి...(అంటూ నిష్క్రమించును)

(తెర)

## అష్టమ రంగము

[కొండుభట్లు యిల్లు. రాత్రి భోజనంచేసి బట్టలు కట్టుకొని పైకి వచ్చి గుమ్మం అవతల నిలిచి]

కొండు: తురకాడిదెబ్బ పదిహేనురోజులు మంచం యెక్కించింది......మంజువాణి ఫికర్లేదు. ఇన్నాళ్లీ ఆశ్రయించి యెంతో సహాయసంపత్తి చేసినాను. శాస్త్రులుగారికి యెలా వుందని మాటవరసకయినా వర్తమానం పంపించలేదు. పంతులుకూడా అదేపద్ధతి అవలంబించాడు. మంజువాణ్ణి వదలివేసి ఏకపత్నీవ్రతుడయినాడుట! దెబ్బకి దెయ్యం వెఱుస్తుందన్నాడు!...గాడిదకొడుకు నన్ను కొట్టాడయ్యా! యీసరికీ గాయంమానలేదు. వీళ్లు మాగడపలోకి రావద్దంటేమాత్రం కందుల గూనలో కాసులకీ కామమ్మ సరసాలకీ దూరమైపోతాం? మంజువాణికి యేమిటి అపకారం చేశాను. ఒక్క తుమ్మలపాలెంవాడు డబ్బియ్యకుండా వెళ్లిపోయినాడు అవీకటిన్నీ......సాయిబు కొంచం భయోత్పాతం చేశాడు. తలుపుకమాత్రం కించిత్తు మరామత్తు తటస్థించివుండవచ్చును. అయితే ఆ అల్లరి తురకాడు చేసిన దేహశుద్ధితోటి పంతులు ప్రాపకం పడిపోయిందని కోపంవుంటే వుండవచ్చును. పైపత్యంలో వున్నాను. యింకా దేహానికి జవసత్వంరాలేదు. తొందరపాటు మనిషి...కఱ్ఱా తిరగేసిందంటె మళ్లా మంచంయెక్కాలి. కుఱ్ఱవాడి పెళ్లి వ్యవధిలేదు. కందులగూనలో కాసులు చేతిపడితే నేగాని పప్పుడకదు. యేమిటిసాధనం...మరేమిటీ లేదు. తిన్నగా వెళ్లడం, యెవరూ చూడకుండా లోపల ప్రవేశించి తటాలున దీపం ఆర్పివెయ్యడం; కందుల గూన

డ్డార్" అప్పుడు తెలుస్తుంది! యెందుకైనా మంచిది. ఆంజనేయ దండకం చదువుతూ ఒక్క విసురున వెళ్ళాననంటే అన్ని భయాలూ పటాపంచలైపోతాయి...శ్రీమన్మహా అంజనీ గర్భసంభూత సదా బ్రహ్మచారీ కపీంద్రాది వంద్యా కిరీటోజ్వలద్రత్న... (మంజువాణి యింటి గుమ్మందగ్గిర నిలిచి మెల్లగా తొంగి చూచు) సావిట్లో యెవరూ లేరు; సావిడీ గదిలోనూ లేరు. (మెల్లగా దీపం ఆర్పేసరికి గభీమని వీధితలుపు గడియ వేసిన చప్పుడగును) చంపేశాడోయి, సాయిబు!... మంజువాణీ! బ్రహ్మహత్య జరిగిపోతూంది!

మంజు: మళ్ళీ సాయిబుని తీసుకువచ్చావు? యిదిగో కందుల గూనవున్న గదిలోనికి వెళ్ళి గడియ వేసుకుంటున్నాను. బ్రహ్మహత్య జరిగితే స్వయంకృతాపరాధంగాని పాపం మాది కాదు!

కొండు: తురకాడి కమ్చీ దెబ్బలు తప్పించుకోవడం కష్టంగా వుంది. బ్రహ్మహత్య జరిగిస్తే బ్రహ్మరాక్షసినై పీక్కుతింటాను.

మంజు: కంసాలి వీరనాభాచారిచేత మారణహోమం చేయిస్తాను.

కొండు: అంతటిదానవగుదువు. (ఆత్మగతం) కిందటిమాటు లాగ కేకైనా వేతునా, యెవరయినా వస్తారు!

మంజు: "ధర్మంకాదిది మంజువాణి వినుమా దాగుంట"

కొండు: నువ్వూ వాడితో కలిశావు. సాహెబ్ అభీ ఛోడ్ తో కభీ ఫిర్ నై ఆయంగె.

సాహె: బొమ్మన్ బాత్ ఝూటా బాత్ (కమ్చీ చప్పుడు చేయును)

మంజు : దీపం యెందుకు ఆర్పేశావు. ఇదిగో దీపం తెస్తున్నాను. ధైర్యం అవలంబించండి.

కొండు : చీకట్లో కొరడాదెబ్బలు తప్పించుకొంటున్నాను. దీపం మాత్రం తేకు; ధర్మాత్మురాలివి. వీధి తలుపు మట్టుకు తీసెయ్యి.

మంజు : (దీపం పట్టుకువచ్చి సాయిబు వేషం నక్కి) శాస్త్రుల్లుగారు ! మంచం క్రిందనుంచి విజయం చెయ్యండి !

కొండు : సాయిబు, సైతానా ? నిజమైన మనిషా ?

మంజు : పైకివస్తే మాట స్పష్టమవుతుంది.

కొండు : సాహేబ్. సాహేబ్. కంచన్ ఘుద్కా కభీ నై జాయంగే.

సాహే : సాలా ! ఝూట్ మే తుమ్ రహాకర్ మే హెర్ చోడ్డేంగే.

కొండు : (ఆత్మగతం) వీడిదగ్గిర యక్షిణీ వుందిరోయి నాయనా! అన్ని రహస్యాలూ వీడికి నెల్లడే. గూనలో కానులు దొబ్బింది. ఈ గండం గడుస్తే డబ్బుమాట చూసుకుందాం. (ప్రకాశం) మహారాజ్ లీజియే ఆప్ కా పాం పకడ్తే.

సాహే : బొమ్మన్ పాం పకడ్తే ?

కొండు : సమయంవస్తే గాడిద కాళ్ళు పట్టుకోమన్నాడు. ఏం చెయ్యను !

సాహే: అచ్ఛా గులామల్లీ దర్వాజా ఖోలో, దేఖ్ కర్కె చెలో.

కొండు: (చెవలపిల్లిలాగ మంచంకిందనుండి జరిగితప్పించును. పరుగెత్తుటలో గుణ్ణం తగిలి జారిపడును.) కందులగూనా యెంతచేస్తివే ...

(తెర)

‘కొండుభట్టీయము’ వ్రాతప్రతి :
అముద్రిత భాగాలు

# * ప్రథమాంకము

## ద్వితీయరంగము

[ పెద్దిపలస రెయిలుస్టేషను ]

(రెయిలుబండీ యింటరుమీడియేటు క్లాసులో శంకరశాస్త్రి చుట్ట కాలుస్తూ కూచుని వుండును. కొండుభట్లు యింటరుమీడియేటుదగ్గిరకు వచ్చి కిటికీలోంచి తొంగిచూసి)

కొండుభట్లు: ప్రభువ్వారా?

శంకరశాస్త్రి: యేంకావాలి?

కొండు: (మొహాన్ని ఆనందం నటిస్తూ) ప్రభువ్వారి దయా, ప్రభువ్వారి దర్శనమూ. అంతకన్న మాబోట్లకేం కావాలి?

శంక: లోపలికి రండి.

కొండు: మా తిలా ప్రభువ్వారు కూచునే బండిలో కూచోడానికి!

శంక: వషట్కారాలు మాని లోపలికి రావయ్యా.

కొండు: ప్రభువ్వారి శలవైనతరువాత రాక తీరుతుందా (యెక్కి కూచుని) "రామహరే! కృష్ణహరే! తవనామ వదామి సదా

---

* అచ్చయిన ప్రతిలో ఇది ద్వితీయాంకములోని షష్ఠరంగము. అందు త్రివిక్రమరావు. యిందు శంకరశాస్త్రి ఒకరే. మంజువాణిని గురించి వున్న యింతవిపులమైన భోగట్టా, అచ్చుప్రతిలో కానరాదు. సాహిత్య పరిశోధకులకు మహాకవి వ్రాసుకున్న ఈ 'నోట్సు' ఉపయుక్తం కాగలవనే అభిప్రాయంతో వాటిలో కొన్ని ప్రధాన కథావిశేషాలను, ఆశయాన్నీ తెలిపే ముఖ్యభాగాలను యిందు పొందుపరుస్తున్నాము; అచ్చుప్రతిలోని త్రివిక్రమరావుకీ, ఈ నోట్సులో వున్న శంకరశాస్త్రికీ గల వ్యత్యాసమూ, ఆ పాత్ర ఎలా మారుతూ వచ్చిందీ చదువరులు గ్రహించగలరు.

మురహారే! కృష్ణ కేశవ వాసుదేవ గజేంద్రవంద్య దయానిధే! కృష్ణ...చంచలాం" యిట్లాగు వేంచేస్తున్నారు? యేమైనా కథ వుందా యేమిటండీ?

శంక : కథకేంవుంది. నేను మంచి అప్సరసలాంటి విధవనుగాని, బుద్ధిమంతురాలైన భోగందిగాని దొరికితే పెళ్ళాడదలంచి వున్నాను. మీ అభిప్రాయమేమిటి?

కొండు : ఆ రెండుపద్ధతులూ మన శాస్త్రాలూ, పురాణాలూ వొప్పుకున్నవే. ఎంతమంది పురుషులు అన్యస్త్రీలను వరించి సంతానం పొందలేదు. ఆ సంతానం వంశకర్తలు కాలేదా?

శంక : మీరు యాజ్ఞీకం చేయిస్తారా?

కొండు : ప్రభువ్వారిదయ అంటూవుండి యీ బీద బ్రాహ్మణ్ణి పోషిస్తే యాజ్ఞీకం తప్పక చేస్తాను.

శంక : పురోహితుడు కుదిరాడు; ఇహ వధువు కుదరవలసివుంది.

కొండు : అది కొంచెం చిక్కైన సంగతి. తమవంటి చదువుకున్నవారు కొందరు యీనాడు అప్సరస్త్రీలను పెళ్లాడడమును అభిలషించివున్నారు. తమ రసికత, తమ ప్రాజ్ఞతా పెయ్యినోళ్ళ పొగడవలసివున్నది; గాని రూపవతీ గుణవంతురాలూ అయిన వేశ్యను పెళ్ళాడడానికి వొప్పించడం అసాధ్యం. "మిక్కిలిరొక్కము లియ్యక చిక్కదురా వారకాంత సిద్ధము సుమతీ" అన్నాడు. కురూపులూ, దరిద్రులూ తలపడవచ్చు. తమవంటి రూపజితమన్మథులకు కోరిన స్త్రీ అంటే యెత్తుకు యెత్తు బంగారివిచ్చి కొనాలి.

శంక: యెక్కడైనా వుందా అలాంటి మనిషి?

కొండు: ప్రభువ్వారి దగ్గర దాచడం యెందుకూ? మా వూళ్లో వుంది ఒక వేశ్యకన్య. రంభా, ఊర్వసీ, తిలోత్తమా దానికి దిష్టితీయడానికి పనికిరారు. పన్నెండేళ్ళు వొచ్చేదాకా నేనే పెంచి విద్య చెప్పి రామసానికి వప్పచెప్పాను.

శంక: మీరా పెంచారు.

కొండు: అహా అనగా అది వొక సత్శూద్రుల పిల్ల. కరువు కాలంలో పోషించలేక తల్లి మాయింట దిగబెట్టి వెళ్లింది. మాయింటిఆవిడ ఆరు సంవత్సరములు దాన్ని తన కూతుర్లాగ మాపిల్లలతోపాటు పెంచింది. యింతట్లో కళత్ర వియోగం సంభవించగానే యీపిల్ల యేస్థలంలోవుంటే దేదీప్యమానంగా ప్రకాశిస్తుందో, ఆ స్థలంలో వుంచాలి గాని యెవరయ్నా దుక్కిముచ్చుకు కట్టబెట్టడం దున్నపోతుకు పువ్వులదండ వెయ్యడం అని తలచి, రామసాని తాఖీదులో పెట్టాను. తమరుగాని ఒక్కపూట మావూళ్ళో దిగివుంటే ఆ చిన్నదాన్ని చూసి ఆనందింతురుగాని. ఆ భోగం దానివంటి రూపసిని ప్రభువువారు యేనాడైనా యెక్కడైనా చూసివుంటే నేను బుర్రగొరిగించుకు వెళ్లిపోతాను.

శంక: మీ వూరేవూరు?

కొండు: సీతారాంపురం.

శంక: సరే. గాని వేశ్యావివాహం శ్రేష్టమా, విధవా వివాహం శ్రేష్టమా?

కొండు: (సామ్యం పిల్చి) గట్టి ప్రశ్న అడిగారు. శ్రేష్ఠం అంటే వేశ్యావివాహమే. యేమంటే వివాహమున్నది శృంగారాన్ని అనుభవించడానికి. ఆ శృంగారమనే విద్యను సక్రమంగా నేర్చిన ప్రౌఢలను పెళ్ళాడడం శ్రేష్టంకాని, పాపం పుణ్యం యెరగని బాలవిధవల్ని పెళ్ళాడడం యేమి స్వారస్యం?

శంక: శాస్త్రులుగారూ! మొగలాయి రాజ్యానికి దివానీ సేయగలిగిన బుద్ధి మీకుంది.

కొండు: తమవంటి ప్రభువుల ఆశ్రయంవల్ల యుక్తాయుక్త విచక్షణ కొంచెం నేర్చాను. అంతేగాని నేననగా యేపాటి వాణ్ణి. నేను మనవిచేసిన వేశ్య అంటే...

శంక: యేంలాభం. పెళ్ళాడడానికి అంగీకరించదని మీరే శెలవిస్తున్నారే.

కొండు: ఆమాటనిజం, బంగారాన్ని మలామా చేస్తే యేమో. శలవైతే ప్రయత్నం సాగిస్తాను. మంత్రానికి అసాధ్యమన్నది వుండగూడదు.

శంక: అంతసొమ్ము విరజిమ్మనేల. అంతంత అసాధ్యం ప్రయత్నించనేల. తమ దృష్టిలో గుణవతీ, రూపవతీ అయిన విధవ యెవరూ లేరా?

కొండు: (ఆలోచించి) వుంది. అదిమాత్రం అనగానే అవుతుందనుకున్నారా ప్రభువ్వారు? అదీ ద్రవ్యసాధ్యమే. ప్రభువ్వారు శలవిచ్చిన విషమ షరతులు అలాంటివి.

శంక: నేనేం విషమషరతులు కోరలేదే!

కొండు: రూపం గుణం ఆవశ్యకంగద. బొడ్డూడని పిల్లలకీ, కురూపులక పురుషసూక్త పారాయణ ఐయితేగాని కుదరదు గదా. ఎదిగిన రూపవతి గుణవతియ్యిన్న పిల్లను వేలకొద్దీ యిస్తేగాని కుదరదు చూశారా సద్యోఫలం.

శంక: వెధవలకికూడా శుల్కమే.

కొండు: గుణవతి కావాలి, రూపవతి కావాలి అంటే ఆ మాట మనవిచేశాను. ఆ రెండూ వొదిలేస్తే మీ చిత్తం. కన్ను గీటేసరికి వెంటబడే ముండలు వున్నారు

శంక: నిజంగా గుణవంతురాలైన విధవ యెవరైనా మీ వూళ్ళో కద్దా.

కొండు: కద్దు. మా బంధువురాలే వొకర్తె వుంది.

శంక: ఎవరు?

కొండు: ప్రభువ్వారిదగ్గిర దాపరికం యెందుకు. నా మేనగోడలే వొక రత్నంలాంటి కన్యవుంది. నాతో మా బసకి దయచెయ్యండి. చిత్తగింతురుగాని.

శంక: అవశ్యం.

# ప్రథమాంకము

## * చతుర్థ రంగము

( రైల్వే స్టేషను )

( రైలు వెళ్లిపోయినది. ఇటూ అటూ జనులు తిరుగుతూ వుంటారు. బెంచీమీద శంకరశాస్త్రి, రామశాస్త్రి కూర్చుంటారు )

శంక : నన్నెరగనట్టు నటించు. రహస్యం భేదించకుండా నటించాలి.

రామ : ఎందుకేమిటండి ?

శంక : మీతండ్రి అసాధ్యుడు. నిన్నుగురించి యెంతో విచారిస్తున్నాను.

రామ : ఆయనతో పరిచయం చేశారా యేమిటి ?

శంక : చేశాను. ప్రిన్సిపిల్సు బొత్తిగా లేవు.

రామ : అంచేతనే నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను. తలుచుకుంటే కోపం వస్తోంది. తెగించి దేశాలంట పోదామని అనిపిస్తోంది.

---

* ఈ రంగంలో వున్న విషయాలు అచ్చుప్రతిలో లేవు. శంకరశాస్త్రి సంఘ సంస్కరణోద్దేశంతో కొండుభట్లు అగ్రహారానికి వచ్చినట్లు యూహించవచ్చును. అయితే దీనిని కవి పూర్తిగా వ్రాయలేదు. ఉన్నదున్నట్లుగా, వ్రాసినంతవరకూ యీరంగాన్ని ఇక్కడ అచ్చొత్తించాము. ఇదే రంగాన్ని ఆయన తిరిగి వ్రాయగా అందులో సరికొన్ని విశేషాలు వున్నందువలన దానిని కూడా సాహిత్యాభిమానులకు అందిస్తున్నాము. అందులో శంకరశాస్త్రి లోకసేవకొరకు నాటకరంగాన్ని ఆశ్రయించినట్లు చెప్పబడ్డది. నాటి సాంఘిక నాటకముల జట్టునుగురించి కొంత భోగట్టావున్నది.

శంక: నాతో యెన్నడూ చెప్పకపోతివే.

రామ: యేమని చెప్పడం. సిగ్గుచేత చెప్పలేదు.

శంక: ఒకరి లోపాలికి మనం సిగ్గుపడనేలా? చేతనయినంత వరకు మళ్ళిద్దాం. మళ్ళకపోతే క్షమిద్దాం. సిగ్గుతోనూ కోపంతోనూ పనిలేదు.

రామ: నామీద దయచేత మీరు అలా అంటారు. లోకంలో తలయెత్తుకు యెలాతిరగను?

# ప్రథమాంకము

## చతుర్థ రంగము

(రెయిలు స్టేషను)

[రెయిలు వెళ్ళిపోయినది. యిటూ అటూ ఒకరిద్దరు కళాసులు తిరుగుతున్నారు. బెంచీమీద శంకరశాస్త్రి, రామమూర్తి కూర్చుంటారు]

శంక: ఆయన మీ తండ్రిగారా?

రామ: ఔనని చెప్పడానికి సిగ్గుపడుతున్నాను.

శంక: సిగ్గుపడవలసిన అవసరంలేదు. నన్నెరగనట్టు నటించు. కారణం వెనకనించి చెబుతాను.

(శెట్టి ప్రవేశం)

శెట్టి: పంతులుగారూ! బండి కుదిర్చాను. దయచెయ్యండి.

శంక: రెయిలు సంచీ మామనిషి పట్టుకుంటాడు. నేను నడుస్తాను.

సెట్టి: తమవంటి దొడ్డవారూ, ధనవంతులూ నడిస్తే మరి బళ్ళవాళ్ళు బతకడం యెలాగ?

శంక : అయితే బండివాడికి అద్దె యిచ్చేసి మనం నడుద్దాం నడక నాకు యిష్టం.

సెట్టి : (రామమూర్తిని చూచి) యిదుగో చిన్నశాస్త్రుల్లు! మన యింటికి యీ పంతుల్లోర్ని తీసుకెళ్ళమని అయ్య చెప్పారు.

శంక : నీతో చబితే నీవే తీసికెళ్ళు.

సెట్టి : నిజమే; యెవరితో చెప్పినపని ఆరే సెయ్యాలి; అదే బుద్ధివంతుడి నచ్చనం. బాబూ! మనం వెళదాం.

శంక : ఆఁ!

సెట్టి : (నాలుగుఅడుగులు నడిచి మళ్ళీ వెనక్కి తిరిగొచ్చి ఒక మనిషి చెవిలో రహస్యం చెప్పి తిరిగి కలిసి నడుచును) బాబూ! ఒక్క-మాట శలవియ్యాండి. సమిష్టికుటుంబం విభక్తమైపోయిం తరువాత అందులో ఒక్కరాడు అప్పులుచేసి రుణాలుచేస్తే తాతలు తండ్రులూ చమటోడ్చి ఆర్జించిన భూవులు అమ్మేస్తాడుగదా! యేంటి న్యాయం?

శంక : నాకు 'లా' తెలియదు.

సెట్టి : పోనిండి; బాబూ! తమకు తెలియం దేమిటుంది తమ వంటి ఘనమైన ఉద్యోగస్థులు...

శంక : నేను ఉద్యోగస్థుణ్ణి కాను.

సెట్టి : తమలాంటి పొప్రయిటర్లకి...

శంక : నేనేమీ ప్రొప్రయిటర్ని కాను.

సెట్టి : అనగా తమవంటి మొఖాసాదార్లకి...ఒకరి చేతికింద ఉద్యోగం చెయ్యడం అవసరవేఁవిటి!

శంక : నేను ఒక చేతికింద ఉద్యోగం చెయ్యలేదు. లోకం అందరి చేతికిందా ఉద్యోగంచేసి సేవచేస్తున్నాను.

సెట్టి : జీతం యెంతబాబూ !

శంక : తలోపావలా, అర్ధరూపాయి, రూపాయీ, రెండు రూపాయిలూ.

సెట్టి : నాకేం బోధకాలేదు బాబూ !

శంక : నేను నాటకం కంపెనీ మేనేజర్ని. ఒక స్కూలు మేనేజర్ని. నాటకాలు ఆడుతాను. బడిచదువు చెబుతాను.

సెట్టి : పరీక్ష యేమైనా ప్యాసైనారా !

శంక : యెమ్మే ప్యాసైనాను.

సెట్టి : అబ్బోరి. యింగిలీషోడి అమల్లో యేపనిచేసినాబంగారం వొలుకుతుంది. అయ్యోరు పనిచేస్తే వొందలు జీతాలు. యేటి ! నాటకాలాడీవోళ్లు పట్నాలు పట్నాలు దోచెయ్యడవే!ఆపార్సీవోళ్ళు యేంతమాపాచేస్తారుబాబూ!ఆడపిల్లల వేషాలు ఎంత గుముగుముగా వున్నాయనుకున్నారు!చిన్న శాస్తుల్లులాంటి కుర్రాళ్లు వాళ్ళ వలలోబడ్డారు.

రామమూర్తి : నోరు ముయ్యి.

సెట్టి : బాబు ! సత్యంగానండి; మా సిన్నశాస్త్రిలుగారు మా బుద్ధివంతులుగాని కొంచెం కొస యెర్రుంది.

రామ : నోరుముయ్యి.

సెట్టి : బాబూ ఆ గుంటల్ని చూసి... గాని ఆ పారిసీవోళ్ళు దేశమంతా జయించుకొచ్చినారు గాని ఈ వూళ్ళో ఆళ్ళ గర్వం అణిగింది.

శంక : యెలాగో ?

సెట్టి : యెలాగనా బాబూ, ఈ వూల్లో కనకవల్లి అని భోగం దుంది. దాన్ని చూసి...

# * ద్వితీయాంకము

## ద్వితీయ రంగము

(తలుపు అవతలకు కనకవల్లి, రామ్మూర్తి, శంకరశాస్త్రి ప్రవేశింతురు. శంకరశాస్త్రి పక్కను వొంగుతూ కనకవల్లి నిలుచును.)

శంక : యెవరు లోపల ?

రత్నం : శెట్టి ?

కనక : శెట్టా ! యెలా వొచ్చాడు.

శెట్టి : యెలా వొచ్చాడా ? రత్నం రమ్మని ప్రాణం తింటే వొచ్చాను.

---

* ఇది అచ్చుప్రతిలో ద్వితీయాంకము సప్తమరంగములోనిది. అచ్చుప్రతిలో మంజువాణి, చిత్తుప్రతిలో కనకవల్లి, ఇద్దరూ వొకరే. మంజువాణి యింటదూరిన శెట్టి రత్నాంగికి పట్టుబడతాడు. అపుడు "తలుపు దగ్గిరికి దాసీలు, మంజువాణి, నరహరిరావు వచ్చి తట్టుదురు." చిత్తుప్రతిలో రామమూర్తి, శంకరశాస్త్రి, కనకవల్లి ప్రవేశించినట్లువుంది. నరహరిరావు ప్రసక్తి చిత్తుప్రతిలోలేదు. అచ్చుప్రతిలో యిక్కడమాత్రమే నరహరిరావు ప్రవేశం. శంకరశాస్త్రి పాత్ర (అచ్చుప్రతిలో త్రివిక్రమరావు)ను గురించిన వివరణకు చిత్తుప్రతిలో గల కనకవల్లి, అచ్చుప్రతిలో మంజువాణిగా మారినని తెలుపుటకు యీ భాగమ్మా యిక్కడ ప్రచురిస్తున్నాము. చిత్తుప్రతిలోవున్న యీ రంగంలోని మిగిలిన విషయాలూ, అచ్చుప్రతిలోవున్న యీ రంగంలోవున్న అంశములూ అన్నీ వొకటే, కనుక ఆ భాగములన్నీ ఇక్కడ అచ్చొత్తించలేదు.

# ప్రధానపాత్రలు



| | | |
|---|---|---|
| బిల్హణుడు | : | కవి; పండితుడు; కథానాయకుడు |
| కర్ణమహారాజు | : | అనిహిల్వాపట్టణపు ఏలిక |
| నానాపంత్ | : | మంత్రి |
| నారాయణభట్టు | : | వైయాకరణుడు |
| కేశవభట్టు | : | తార్కికుడు |
| మాధవశర్మ | : | యామినీదేవికి విద్యాగురువు |
| కృష్ణస్వామి | : | కవి |
| రామశాస్త్రి | : | కవి |
| | | విదూషకుడు |



# బిల్హణీయము

## మొదటి అంకము

### ఒకటవ స్థలము

అనిహిల్లా పట్టణంలో రాజు ఆస్థానము

[వైయాకరణుడు నారాయణభట్టును, బిల్హణుని మిత్రుడగు తార్కికుడు కేశవభట్టును ప్రవేశింతురు.]

నారాయణభట్టు: మహాభాష్యానికి ఇతని తండ్రి వ్రాసిన వ్యాఖ్యానం ప్రమాణంగా యెవరు వొప్పుతారండీ! ఆలాగైతే, నా శిష్యులు వ్రాసిన వ్యాఖ్యానాలుకూడా ప్రమాణావే! యేవంటారు?

కేశవభట్టు: వాదానికి యుక్తి ప్రధానంగాని, పుస్తకాలతో యేంపనండీ!

నారా: యుక్తిలో నీరససారసాలు కనిపెట్టేదా తేడండీ? ప్రభువులు నూతన ప్రియులు. ఆశ్రయించుకున్న వాళ్ళను క్షీణత పరచడమూ, పరాయివాణ్ణి నెత్తికెక్కించుకోవడమూ వారికి నైజగుణం.

కేశ: గొంగళీలో తింటూ, వెంట్రుకలు లెక్కపెట్టాడట! యిప్పుడు, క్షీణత మనకు కొత్తగా వొచ్చిందా యేమిటండీ! భోజరాజుకాలంనుంచీ కవిత్వం విలవ హెచ్చింది; శాస్త్రాలు అడుగంటాయి. నాలుగు శ్లోకంముక్కలు అల్లుతారనేకదా, రామశాస్త్రిని కృష్ణస్వామిని రాజు యిప్పుడు మన అందరి నెత్తిమీదా కూచోబెట్టాడు.

నారా : పధవ కవిత్వం ! నా శిష్యులు చెబుతారు అంతకన్న మెరుగ్గాను, పరిశీలించేవాడేడండీ ?

కేశ : కనక మనకు యిప్పుడు కొత్తగావచ్చిన నష్టమేమీ లేదని నామతం. బిల్హణుడి, నీకూస్నేహం కలుపుతాను. రండి!

నారా : ఐతే వాడికాళ్ళు పట్టుకోమంటారా యేమిటి ?

కేశ : ఏమీ, బిల్హణుడు, రామశాస్త్రీ కృష్ణస్వామీ వాళ్ళ పండితుడూ, కవీ కాడనా మీ అభిప్రాయం ?

నారా : ఆ పీనుగులకంటె, యెవడైనా నయమే అని నా అభిప్రాయం.

కేశ : నేను చెప్పవచ్చినమాటా అదే. బిల్హణుడు మహాకవీ, ప్రతిభావంతుడున్నూ. అప్పుడే రామశాస్త్రుల్ని, కృష్ణస్వామికీ కొనమళ్ళించాడు. అది మనకో గొప్పలాభం కాదా ?

నారా : ఔనుగాని, మన కొనకూడా మళ్ళించే ప్రయత్నం చేస్తున్నాడే !

కేశ : మనకు కొనంటూ వొకటి వుంటేకదూ, మళ్ళించడానికి ? మీ, నా అదృష్టాలు నాడే గిడసబారాయి. రాజు మన శాస్త్రాలు అక్కరచెయ్యడమే మానేను. మనం సభకు రాకపోయినా యేమైనారని తనుపే లేదు. మన పదవి సదక్షిణాకంగా ధారపోస్తే వొల్లడు బిల్హణుడు.

నారా : అవును, మన అవస్థ అలాగేవుంది.

కేశ : యీపాటి భాగ్యానికి అతగాడితో వృథావాదం మనకెందుకూ ? కలహం పెంచకండి. నిన్న మీ ఉభయులూ

నాడిస్తావున్న సమయంలో, రాజు ఉదయమంత్రితో రాచకార్యాలు ప్రశంసించుచుండెను. కనిపెట్టితిరా?

నారా: ఆలాగనండీ! అయితే నావాదవంతా వృథాయే? అవును. రాజు మెచ్చుతాడన్న ఆశ చాలకాలమాయి వొదులుకున్నాను, గాని, జినచంద్రుడయినా మెచ్చుకున్నాడా?

కేశ: స్తంభాన్ని జారబడి నిద్రపోయినాడు.

నారా: ఆసి! వీడి బొడ్డుపొక్కా! పాండిత్యం కురిపిస్తూంటే యలా నిద్రపోయినాడయ్యా?

కేశ: ఇక్కడికి సంతుష్టి అయిందా?

నారా: అయితే ముందు యేం జేదాం?

కేశ: ఇటుపైని వాదం మానేసి, బిల్హణుడు యేమన్నా మెచ్చుకుందాం.

నారా: ఓడిపోయినావనుకొంటాడేమో?

కేశ: బిల్హణుడి యోగ్యత మీా రెరుగరు. ఎవటివాడి సత్తువ యెన్నే ఔదార్యం పండితుల్లోకల్లా అతనియందే కలదు. నిజమైన విద్వత్తుకు జోహారు చేస్తాడు. అతను వైరులకు పిడుగు; స్నేహితులకు చందనము.

నారా: అయితే నాపాండిత్యం విషయమై అతగాడి అభిప్రాయం యెట్టిదో కనుక్కున్నారా?

కేశ: దిగ్దంతులం, మన పాండిత్యం విషయమై, ప్రాజ్ఞుడైన వాడికి మరో అభిప్రాయం యెలాకలుగుతుంది? ఆయన మనసులో మాట దాచేవ్యక్తికాడు. రేపో నేడో ఆయన

ముఖతః వినా లేవింటాడు. అదుగో మాధవశాస్త్రి వస్తున్నాడు. మొహం మంగలంలావుంది.

[యామినీదేవికి విద్యాగురువు మాధవశాస్త్రి ప్రవేశించును.]

మాధవ: రాజుకు మతిపోయింది.

నారా: యేవఁండోయి?

మాధ: యామినీదేవికి బిల్హణుడిచేత, విద్య చెప్పిస్తాడట!

నారా: మరి మీరో?

మాధ: కొత్తనీరొచ్చి పాతనీరు కొట్టుకుపోయింది.

నారా: యేం విద్య చెప్పిస్తారో?

మాధ: యేం విద్యో నాకేంకావాలి! త్రిపురాణతలో త్రిపురాణత, అతగాడు చదువు చెబుతూవుంటే నేనుగూడా వింటూ దగ్గిర కూచోవాలట! "విపులాచ పృధ్వీ" అన్నాడు, మరో రాజు కాళ్ళు పట్టుకుంచాను.

కేశ: బావా, తొందరపడకు. నీజీతం నిలువుకాలేదు గదా?

మాధ: లేదుగాని పువ్వులమ్మిన వూళ్లో కట్టెలమ్మవలశి వచ్చిందిగద?

కేశ: రాజుల యిష్టాయిష్టాలు, మనమూ శాసించేవాళ్ళము! పండితుడన్న వాడికి, కాలుకాలిన పిల్లిలాగ దేశాలు తిరిగి కష్టజీవనం కల్పించుకోడానికి బదులుగా, గొప్ప ఆస్థానమందు ఉపాధికలగడం పెద్దఅదృష్టం కాదా? అది తన్నుకుపోవడం ఉచితంకాదు. మన రాజు రాజర్షి; యిట్టి రాజు యెన్ని రాజ్యాలు తిరిగినా మీకు దొరకడు.

మాధ: రాజర్షయితే యిలాంటి ఘోరం ఆచరిస్తాడండీ!

కేశ : ఘోరానికీ అఘోరానికీ మీరయినా యామినీదేవికి కలకాలం విద్య చెప్పేది లేదుగద ? రేపో నేడో ఆమెకు వివాహానైc విద్య కట్టడుతుంది. యీలోగా బిల్హణుడు నోల్లుకుపోయింది యేమీలేదు !

మాధ : యెవడిదాక వొస్తేగాని వాడికి తెలియదు.

కేశ : యెవడైనా కాక తీరనిపనికి తలవంచక తీరదు; రాజుకు యెవడు మాన్యుడైతే మనకు వాడే రాజు గనక బిల్హణుణ్ణి మంచి చేసుకోవడమే నీతి.

మాధ : మానభంగానికి కారణభూతుడైన శత్రువును, బతిమాలు కొమ్మన్నావు. మంచినీతే !

"రథకారో నిజాం భార్యాం
సజారాం శిరసా కరోత్" అన్న న్యాయంగా

వుంది నీ సలహా !

కేశ : మనిషి దైవసృష్టి, శత్రుమిత్రులు మనుష్యసృష్టి.

"అయం బంధుః పరోవేతి గణనా లఘుచేతసామ్ ।
పుంసా ముదార చిత్తానాం వసుధైవ కుటుంబకమ్॥"

మాధ : చాల్చాలు, నీ కుతర్కం చాలించు.

[తెర వి కృష్ణస్వామి ప్రవేశించును. మాధవశర్మ అతనికి యెదురుగా వెళ్ళి]

మాధ : విన్నారా ?

కృష్ణ : చూచాయగా.

మాధ : (నారాయణభట్టుతో) చూశారా, అప్పుడే వూరందరికీ తెలిసింది. (కృష్ణస్వామితో) ఆ వుత్తరాదివాడు మీకంటే పెద్దకవిషండీ ?

కృష్ణ : పెద్దకేంవుంది; అందరికంటే తొందర చెప్పు పైగ. కవిత్వం ఒకపాటిగా చెబుతాడు; గాని పండితుడు.

మాధ : పండితుడే కాగట్టండి ! ఒకపాటి కవి కాడు. మహాకవి నే అనండి. రాజపుత్రికలకు సంగీతాలనుంచి ఆస్థానం కవిపెట్టు కొని కాలం గడిపిన మీరా, నా సోటివాను విస్వ చేస్తున్నది భావ్యంగాని, శీలం యెట్టిదో, సాంప్రదాయం యెట్టిదో తెలియని దిక్కుమాలిన పరదేశిని అంతఃపురంలో ప్రవేశ పెట్టడం ఉచితమేనా ?

కృష్ణ : ఆమాట అన్నారు, ఒప్పుకున్నాను.

మాధ : (మెల్లగా) మాటవరసకు అనుకుందాం. బిల్హణుడు జారుడైతే ?

కృష్ణ : మీా పుట్టిం మునిగింది ? రాజు అనుభవిస్తాడు.

మాధ : ఈలోగా యీా అవమానమంతా, నేను అనుభ వించాలిగదండీ ?

కృష్ణ : మానావమానాలు, వరడు యిస్తేనా వస్తవి ? రాజు టండీ బుద్ధియొక్కా, విద్యయొక్కా విలువ కొత్చేవాడు ? లేకుంటే, ఆ రామశాస్త్రుల్లు పాట్లకవిత్వం మెచ్చుతాడు గదా, రాజు తెలివి యేమని చెప్పను !

మాధ : అయితే యిప్పుడు మనం యేంచేయడం, మీా సలహా.

కృష్ణ : సలహాకేవ్వుంది ? మాట్లాడక ఊరుకోవడవే సలహా.

మాధ : యీా అప్రతిష్ఠ సహించి యెలా వూరుకోవడం ? నాలుగు మాసములు శలవు పుచ్చుకుని తీర్థయాత్రలు వెళుదునా ?

కృష్ణ: వెళ్ళండి.

మాధ: (మెల్లగా) ఆహవమల్ల మహారాజు పట్టపుదేవి తరుచు వర్తమానం చేస్తూన్నారు. వస్తే నాలుగుగ్రామాలు అగ్రహారంగా దయచేయిస్తావన్నారు.

కృష్ణ: అలాగైతే, యింకా ఆలోచిస్తారేవిఁ?

[వైయాకరణులు జినచంద్రుడును, గోవిందశాస్త్రియును ప్రవేశింతురు.]

జిన: పడపడవాగితే, యీ రాజులు డంగైపోతారు. నాలుగు పంక్తులు వ్రాస్తే పస బయలుపడుతుంది. పత్రికావాదం పెట్టి, పత్రికలు కాశీకి పంపమనండీ, బలాబలాలు తెలుస్తాయి.

[కవి రామశాస్త్రి ప్రవేశించును]

గోవింద: అతగాడికి వుపాసనాబలం వుందండీ. వాదన సమయంలో నాకు యెన్నోయుక్తులు స్ఫురిస్తాయి. వాక్స్తంభనవి మాట పైకిరాదు. మనిషిని గెలియడం శక్యంగాని, మంత్రాన్ని గెలియడ వేఁలాగ.

రామ: అంత పెనుప్రళయం అతగాడిలో యేమీ కానరాలేదే?

మాధ: (రామశాస్త్రిని పక్కకు పిలిచి) యేనాటికి యేవాఁస్తుందో తెలియదు.

రామ: యిప్పుడే వొఁచ్చింది?

మాధ: యీనాటికే యామినీదేవికి చదువు చెప్పడానికి నేను తగాను కాను.

రామ: యేమండి?

మాధ : యేమో, రాజుగారికే తెలియాలి. రేపటినుంచి బిల్హణుడిచేత విద్య చెప్పిస్తారట !

రామ : అలాగనా, ప్రభుచిత్తం మనమేం చెయ్యగలం ?

మాధ : అంచాతనే దేశాంతరం వెళ్ళడానికి ఆలోచించాను.

రామ : అట్టి ఆలోచన యెన్నడూ చెయ్యకండి. మీరాడపిల్లలు వాళ్ళు, యిల్లూ వాకిలీ, తోటా దొడ్డీ కల్పించుకున్నారు. యెక్కడికి వెళ్ళినా లోకం అంతా యిక్కడిలాగానే వుంటుంది. మరిఏక రాజ్యంలో మాత్రం ధర్మం నాలుగుపాదాలా నడుస్తుందనుకున్నారా ? వట్టిభ్రమ ! ఆమాటకి మన రాజ్యమే నయం. రాజు సత్యసంధుడు. నిలబడి నిగ్రహించడం నీతి గాని యెవడో డంబాచారివచ్చాడని నొగలువిప్పి వెయ్యడం పౌరుషమేనా ?

మాధ : నాలుగురోజులు జబ్బుపేరుపెట్టుకుని యింటవుండి పోదునా ?

రామ : రాజు పోల్చుకొని కార్పణ్యం వహించగలడు.

మాధ : అయితే యేంజేదాం ?

రామ : (మెల్లగా) యిటురండి (నాలుగు అడుగులు ముందుగా వెళ్ళి) కపటస్నేహంచేసి వాడి లోతుపాతులు కనిపెట్టండి. కర్తవ్యం ముందు ముందు ఆలోచించుకుందాం.

మాధ : మీ సలహా బాగుంది.

రామ : సాయంత్రం కలుసుకు మాట్లాడుదాం. యిప్పుడు యెడంగా వెళ్ళిపోండి. బిల్హణుడు వస్తున్నట్టుంది.

[బిల్హణుడును, పురోహితుడును ప్రవేశింతురు.]

బిల్హ : బ్రాహ్మణోత్తములకు నమస్కారము.

రామ : (నారాయణ శాస్త్రితో) చూశారా, బ్రాహ్మణోత్తము లంటాడుగాని పండితులనడు.

(బిల్హణుడు సభామంటపంలో నిలుచున్నవారిని చూపువిసురుచు పరికించి, నారాయణభట్టు దగ్గరకుపోయి కౌగలించుకొనును)

బిల్హ : పండితోత్తమా, మీరు పతంజలి అపరావతారము. మీ వాగ్ధోరణి నిన్న నాకు అపూర్వకర్ణానందము చేసినది. నన్ను మెప్పించిన వైయాకరణి కిత్తునని నే ప్రతిజ్ఞ చేసిన యీ రుద్రాక్షమాల మీ కంఠము నలంకరించుగాక !

(తన మెడలోని బంగారుకట్టిన రుద్రాక్షమాల నారాయణభట్టు మెడను వేయును.)

నారా : వద్దు - వద్దు - వద్దు; నేం తగను. మీవంటి మహానుభావుల మెప్పే పదికోట్లు.

[రుద్రాక్షమాల చేతబట్టి తీయునటుల అభినయించుచు కేశవభట్టు వంక చూచును. నలుగురు పండితులు చుట్టూ మూగుదురు.]

కేశ : మహాపండితుడు చేసిన సన్మానం ప్రభుసన్మానముకన్న దొడ్డది. ఉంపించండి.

బిల్హ : యీ అపూర్వమయినమాల రాజపండితుడైన కర్ణ మహారాజు కంఠమును మున్ను అలంకరించెను. ఇప్పు డది పండితరాజు కంఠము నలంకరించినది.

రామ : (మాధవశర్మతో మెల్లగా) మహారాజిచ్చిన మాల భట్టు కిచ్చాడు. యేమి యితగాడి పొగరూ !

మాధ : (రామశాస్త్రితో) వీడు యెన్నాళ్ళో దక్కడు.

[పూజబ్రాహ్మణుడు ప్రవేశించి]

పూజ : మహాప్రభువువారు పూజాగృహానికి విజయంచేశారు.

(పండితులు బ్రాహ్మణుడవెంట పోదురు)

## రెండవ రంగము

(కర్ణ మహారాజు పూజామంటపము. రాజు పూజచేసి యుండును, ఇరుపక్కలనూ పండితులును, ఉద్యోగస్థులును కూర్చుని యుందురు.)

కర్ణమహారాజు : నిన్నటి వాదములో యెవరు గెల్చినట్లు?

కవి రామశాస్త్రి : గెలుచుటకూ, వీగుటకూ యేమున్నది మహారాజా!

కేశ : సత్యమే అన్నదాతా! పూర్వ పశ్చిమ సముద్రములకు వారయేమిటి? అసాధారణ ప్రతిభావంతులగు మహాపండితులచేత ఉత్పాదితమైన వాక్పరంపర భగదుత్పాదితమగు సృష్టి పరంపరవలెనే (చెయ్యి రామశాస్త్రిపైపు తిప్పి) అస్మదాదులకు ఆశ్చర్యజనకమై యెన్న నశక్యమై యుండును. విష్వ్యంశ సంభూతులగుటను, వారపారలు యేలినవారికే తెలియవలయును.

కర్ణ : రామశాస్త్రులుగారు యేమంటెరి?

రామ : మహారాజా! కేశవభట్టుగారు తార్కికులు గనుక వాదాదరమనస్కులు. మంచి దేకాని వివాదాంశము వస్తు తత్వమును గూర్చిగాక, పరవస్తు తత్వమునుగూర్చి కాక, ఒక వ్యాకరణ సూత్రమందు ఒక్కమాటకు వినియోగమున్నదా లేదా యను కుశంక ననుసరించి యున్నప్పుడు, అట్టివాదము కాలము వెళ్ళపుచ్చునుగాని, తత్వాన్వేషణ

మునకు కానేరదు. సూత్రములు ఋషిప్రణీతములు. మార్చ బడనేరవు. గాన, వాదమునకు చరితార్థము తక్కువ. వినోదార్థము చేయు ప్రసంగములకు వీగుగెలుపు లెక్కడివి మహాప్రభో!

కేశ: వ్యాకరణము వేదాంగమై, శబ్దబ్రహ్మమును గూర్చిన శాస్త్రమైనపుడు చరితార్థము లేకుండుట యెటుల?

"అజ్ఞానాంధస్య లోకస్య జ్ఞానాంజనశలాకయా
చక్షురున్మీలితం యేన తస్మై పాణిన యేనమః॥"

అనే శిక్షావాక్యము నిరర్థకముకానోపునా?

విదూషకుడు: వారి వ్యాకరణశాస్త్రము శబ్ద బ్రహ్మపరము. మీ తర్కశాస్త్రము అర్థబ్రహ్మపరము. అర్థబ్రహ్మనే అందరూ ఉపాశిస్తారు; శబ్దబ్రహ్మంతో సంతుష్టి తక్కువ. అర్థంమాట కొస్తే మంత్రి నానాపంతులు మహాపండితులు. మీరంతా నిరర్థకులే

రామశాస్త్రి: స్వారస్యం బాగా తీశావూ.

మంత్రినానాపంత్: చుట్టూ తిరిగి ముక్తాయింపు నామీదే?

విదూ: నిజంచెబితే నిష్ఠూరం! "యస్యాస్తివిత్తం సనరః కులీనః స పండితః" అనలేదా?

రామ: అవును, కాకేమీ? అర్థశాస్త్రంలో నానామంత్రులు పండితులే!

విదూ: ఆమాటే నేనంటేహాస్యం; మీరంటే నిజం.

కర్ణమహా: నిజమనేది యేమిటో?

విదూ: మంత్రులాడే మాటలల్లా నిజం.

కర్ణమహా : వారు అబద్ధమాడినా నిజమౌతుందా ?

విదూ : సాగింది నిజం, సాగంది దబ్బర. మంత్రులనేమాట సాగుతుంది గనుక, వారనేమాటల్లా నిజమే. యింకా ప్రభువు మాట సాగక తరుచు దబ్బరౌతుంది.

కవికృష్ణస్వామి : గౌతముడిది యేదో వినియోగంగల వాదం గాని, వ్యాకరణ వాదంలాగ నిరర్థకం కాదు.

కర్ణమహా : మంత్రివర్య ! గౌతములయెడల మనమేమో అపరాధము చేసినట్టుంది.

నానామంత్రి : మహాప్రభో, ప్రభువులకు ధనం కూడిక చేస్తే అది అందరికి అపరాధమే.

విదూ : యెన్ని అక్రమాలు చేసినా, మంత్రులకు యిది పకడాలు దొరికింది. నీతినిపుణుడైన మంత్రి, స్వప్రతిభవల్ల కొత్తమార్గాలు కల్పించి, ధనసంగ్రహం చెయ్యాలిగానీ, రాజునూ, రాజునాశ్రయించుకున్నవాళ్ళనూ యెండు చాపలవలె యిగరగట్టడమా ప్రయోజకత్వము ?

కవికృష్ణ : మరి వారిజాగ్రత ప్రభువులకు వ్యక్తం కావడ మెలాగ ?

విదూ : గనక ఆస్థానమందు కనిపెట్టుకునివున్న వాళ్ళకే, మొదట తాళం పట్టాలి. పయిన యెంతదూబర అయినా చింత లేదు.

కవికృష్ణ : మహాప్రభో, మన ఉద్యోగస్థులమీద గౌతముడు పద్యం చెప్పాడు. చిత్తగించతగివున్నది.

కర్ణమహా : యేదేదీ ?

గౌతముడు : వారి మహిమ "అతీతః పంథానం । వాఙ్మనసయోః" అయినా "చకితమభిధత్తే" అన్నట్లు చెప్పాను.

క. దబ్బరలుం గొండెమ్ములు
మబ్బువలెం గ్రమ్మ మాయ మాటలతీపున్
నిబ్బారు మొండితనముచు
నబ్బాగు విద్యలిచటి యధికారులకున్.

కృష్ణస్వామి : అక్షరలక్ష ఇయ్యతగివుంది.

నానామంత్రి : హాస్యగాణ్ణి అయినా, హద్దుమీరి వుంచాలి.

కర్ణమహా : (చిరునవ్వుతో) హద్దుమీరిన మనిషి ఒక్కొక్కడు ఉంటేనేగాని, హద్దుయొక్క గుణాగుణములు తెలియవు. మనవలె ఉచ్చావస్థలో నున్నవారిని స్వేచ్ఛగా తిట్టగలిగిన వారిని వకరిని, అచ్చుబోసి వదిలితేనేగాని మనను గూర్చి లోకం యేమనేదీ మనకు తెలియబోదు. యేమంటారు?

కృష్ణ : సత్యం! సత్యం! పునస్సత్యం!

రామ : మహారాజా, ఉచ్చావస్థలో నున్న ప్రాజ్ఞులు మంచి చెడ్డలు యెఱగకనా సంచరిస్తారు? మంచి చెడ్డలన్నవి అంతకన్న లోకులకు బాగా తెలియగలవు?

విదూ : భర్తృహరి ప్రభువులను గూర్చి యేమో చెప్పాడు. రామశాస్త్రుల్లుగారికి విస్మృతి వచ్చినట్టుంది.

నానామంత్రి : తల్లితండ్రులు ప్రభువులను దిద్దాలి. మాబోటి అధికార్లను ప్రభువులు దిద్దాలి; గాని తిట్టి బతకనేర్చిన కడుపుకూటి బ్రాహ్మడా, మహాప్రభో తప్పొప్పులు కనిపెట్టేవాడూ? కొందరు మహానుభావులు యితగాడికి

విందులు పెట్టి. వారి పగలు యీ వికటకవిద్వారా తీర్చుకుంటారు. అయినా, నౌకరుకు విచారం లేదు. ప్రభుసేవా దైవసేవలతో కాలం వెళ్ళబుచ్చే మనిషి. దూషణ భూషణ తిరస్కారములు సరకుగొనడు. మనవి చెయ్యవలశినమాట ఒకటి వుండిపోయింది మహాప్రభో! మాతా మహారాణి వారి శలవైనది. మహారాజ కుమారికా వారికి విద్యాభ్యాసము ముగించవలసిన కాలము మీరినదని వారి అభిప్రాయము.

కర్ణమహా: అమ్మాజీవారిఆజ్ఞ మనఅందరికీ శిరస్సనధార్యము.

కృష్ణస్వామి: (విదూషకునితో) యేమి వెన్నుకుప్ప పరిశీలిస్తున్నావు!

విదూ: ఈ దొడ్డసలహా, మాతా మహారాణీవారికి, యెవరు మనవి చేసి యుందురో అని.

కర్ణమహా: వెన్నుకుప్ప చెప్పనా!

నానామంత్రి: నేను మనవి చేశానని కాబోలు, యీ గ్రాహ్మాడి మాటల ధ్వని. శ్రీకృష్ణులు సాక్షి. నేను మనవి చెయ్యలేదు.

కర్ణమహా: యెన్నడూ ఓట్లు వేసుకోకండి. ఓట్లు వేసుకోవడం యితరులు మనమాట నమ్మరనికదా! నమ్మినా, నమ్మకపోయినా, ఓట్లు కార్యము లేదుగదా!

రామశాస్త్రి: సలహామాటకువస్తే, యీ విషయములో ఒకరిసలహాకు యేమి అవకాశం కద్దు! మహారాజ కుమారికావారికి విద్యాభ్యాసపు టీడు మీరినదని, ఒకరు

విన్నవించినగాని, మూతా మహారాణివారికి తెలియదు కాబోలును.

విదూ: కొందరు అధికార్లకు ఆశ్రయణమూ, పొగడ్తా రుచి. బిల్హణుడు ఉద్యోగస్థులకు కైవారం చెయ్యడు వారి నోట వచ్చిన మాటకల్లా అహా! హా! అని ఆశ్చర్యం నటించడు. వొచ్చిన ఉపద్రవం యిది.

కృష్ణస్వామి: నిజమైన పండితుడికి ప్రభువులయందే లక్ష్యం వుంటుందిగాని, ఉద్యోగస్థులయందు లక్ష్యం యేలవుండును?

రామ: ప్రభులక్ష్యమేలేని పండితులకు ఉద్యోగస్థుల లక్ష్యవెలా వుండును?

నానామంత్రి: బిల్హణుడు ప్రభువులను కూడా లక్ష్యపెట్టడా? మహాప్రభువువారిని గూర్చి చులకనగా ప్రశంసించెనా? యేమిటి! అంత వాడూ అవును!

మాధ: ప్రశంస అని ప్రశంసకాదు. ప్రభువులు చేసిన సన్మానాన్ని నిరాకరించారని కాబోలు రామశాస్త్రిగారి భావం.

కర్ణమహా: అదెలాగ?

కృష్ణ: మరేమీలేదు యేలినవారు దయచేసిన రుద్రాక్షమాల, పదిమంది పండితులలోనూ, నారాయణభట్టుగారి మెడను వేశారు (రామశాస్త్రితో) అదేకదండీ మీరనబోయే మాట?

కర్ణమహా: (కనుబొమలు తెగయ యోచననటించి) అలాగనా స్వామీ!

కృష్ణస్వామి: నా కళ్ళతో చూశాను.

నానామంత్రి: ప్రభువులు, వచ్చిన దాసరినల్లా మెచ్చి

హారాలూ, అందలాలూ యిస్తావుంటే, వాళ్ళు నిర సించడం ఆశ్చర్యమా !

విదూ : ప్రభువులకెల్లానైనప్పటికీ, ఒక కాసైనా యివ్వకుండా మీరు కలకాలం తిప్పుతూవుంటే, ప్రభువులు వాళ్ళని పిలిచి, హారాలూ, అంగదాలూ, యివ్వవలసి వొస్తుంది. యిదే మీలాంటి మంత్రులు ప్రభువులకు చేసే కూడిక.

కర్ణమహా : మంత్రివర్యా. బిల్హణకవి యిట్టిపని చేస్తారని మేము తలచి యుండ లేదు.

నానామంత్రి : దేశద్రిమ్మరి ! తరతరాలనుంచి కనిపెట్టుకున్న వాళ్ళకి వుంటాయిగాని యేలినవారి యెడల భక్తి విశ్వాసాలు, ఇట్టివాడికెలా వుంటాయి ?

కృష్ణస్వామి : బుద్ధి విలవ తక్కువ అనండి. స్వదేశిఅయితేనేం, పరదేశి అయితేనేం !

నానామంత్రి : కాకుంటే, తన తలేవిటి ప్రభువులు తనకిచ్చిన అమూల్యమైన హారం, తానంటూ మరి పరపండితుడికి బహుమానం చెయ్యడమేవిటి ?

కర్ణమహా : యిట్టి బిల్హణులచేత మహారాజకుమారికకు చదువు చెప్పించవలెననుకుంటిమి. ఈయన ప్రవర్తనకు తగిన ప్రతిక్రియ యెద్ది ?

విదూ : తన్ని తగిలివెయ్యడం.

నానామంత్రి : ఉచ్చాటన చెయ్యడమున్నూ అతని వద్దనున్న ధనము తీసికొని, ధర్మవినియోగము చెయ్యడమున్నూ ఉచితమని తలుస్తాను.

కేశవభట్లు: క్షమాపణకోరి, విన్నవిస్తును. మహారాజాధిరాజా! పండితుడు శిక్షార్హుడు కాడు. "విద్వద్దండమగౌరవమ్" అదిగాక నేనున్నది ఒకటి స్థాపించవలసి...

కర్ణమహా: (కొంచముకోపనసంగా) నేరం లేదనామీ అభిప్రాయము?

కేశ: చిత్తం, చిత్తం, నేను యేమి మనవి చెయ్యగలను.

మాధవ: నేరవేం కాకపోతే యెన్నడూ కోపపడెరగని ప్రభువులకు కోపమెందుకు వచ్చేని?

రామ: (మాధవశర్మతో మెల్లగా) ఊరుకోండి.

కర్ణమహా: మంత్రివర్యా, ఈ బ్రాహ్మణ్ణి అరనైగడియల్లోగా పట్టంలోనుంచి సాగనంపితే?

నానామంత్రి: చిత్తం. యేలికశాసనము యీ క్షణమందే అమలు చేస్తాను. (పత్రికవ్రాసి పంపును)

కర్ణమహా: మంత్రివర్యా, మహారాజ కుమారికావారి విద్యాభ్యాసము విషయమై మీ అభిప్రాయ మెట్టిది? మీరు అనుభవశాలులు, సాంప్రదాయజ్ఞులు.

నానామంత్రి: మాతా మహారాణీవారి శెలవు ఆ ప్రకారం అయినది. నేను యేమిచెయ్యగలను?

కర్ణమహా: సంగీత సాహిత్యములూ, కొంతవరకు తర్కవ్యాకరణములూ, బావాజీవారు చెప్పించారు. అదంతా మాధవశర్మగారి ఆశీర్వచనఫలంగాని, యీ విద్యలు జ్ఞానసాధనములు. ప్రత్యేకం వీటియందు విలువలేదు. భగవద్గీతను ఉపదేశించి మరీ విద్యాభ్యాసము విరమించడము ఉచితమని యిదివరకు అనుకునివుంటిమి.

నానామంత్రి: పలికలవాక్యములు గురూపదేశములు. విద్య అనగా ముక్తిసాధనమైన విద్యే. సందేహమేమిటి మహాప్రభో!

కర్ణమహా: మహారాజకుమారిక భగవద్గీతను పఠించతగ్గదనే మీ అభిప్రాయమా?

నానామంత్రి: చిత్తము. నా చిన్నతనంలో మా నాన్నగారు పఠిస్తూవుండగా నాకుకూడా గీతాశ్లోకములు కంఠోపాఠంగా వచ్చినవి. ప్రాజ్ఞుడనైనతరువాత వారణాసిలో గురుముఖతః గీత ఉపదేశం అయినాను. దక్షిణయాత్రలు వెళ్ళినప్పుడు కాంచీపురంలో లక్ష్మణాచార్యులవారివద్దకూడా గీతార్థం విన్నాను. నేను అజ్ఞుడనేగాని, నే మనవిచేసిన స్వారస్యాలు వారు చిత్తగించి ఆశ్చర్యపడేవారు. అది అల్లా అమ్మాజీ మహారాణీవారి శిక్షాప్రభావం మహాప్రభో:

కర్ణమహా: సందేహమేమి? సముద్రమునకైనా మేరకద్దుగాని, మనిషిబుద్ధికి మేర యెక్కడిది? వ్యాఖ్యానకర్తలూ, మనవంటి మనుష్యులేనా? గురువుబుద్ధికి పై ఆ డనతెనసి శిష్యుడు ప్రవర్తిస్తేనేగాని విద్య పెరగదు. అమ్మాజీవారికి భగవద్గీతయందు మంచి ప్రవేశము కలదు. మీరు మనవిచేస్తే మహారాజకుమారికావారికి కూడా ఆ గ్రంథరాజమును చెప్పించుటకు వప్పుదురేమో!

నానామంత్రి: శలవయితే మనవిచేస్తాను.

కర్ణమహా: మీరు మనవిచేస్తే, వారు ఆమోదించడముకు అభ్యంతరం వుండబోదు. గాని బిల్హణులు వెళ్ళిపోతే యెవరిచేత ఉపదేశం చేయింతుము!

నానామంత్రి: మన పండితులు దిగ్దంతులు యెవరైనా చెప్ప గలరు.

కర్ణమహా: లోకానుభవమూ, బోధకతాశక్తీకలవారు మీా రేల చెప్పరాదు?

నానామంత్రి: ప్రభువుల శలవైతే, తప్పకుండా చెప్తాను. మాధవశర్మగారి సహాయం వుండనే వుంటుంది.

మాధవ: ఆహా.

కర్ణమహా: అయితే అమ్మాజీవారితో మనవిచేసి వత్తురా!

నానామంత్రి: చిత్తం. మనవిచేసి యిప్పుడే తిరిగీ హాజరవు తాను. (నిష్క్రమించును.)

విదూ: యేమి చిత్రమైన లోకమూ!

కర్ణమహా: కొత్తచిత్రం యేమి కనబడ్డది?

విదూ: నేను ఒకణ్ణితప్ప లోకంలో మరియెవడికీ తన అవ స్థతో సంతుష్టిలేదాయె?

కర్ణమహా: యెలాగో?

విదూ: పండితులకి ఉద్యోగాలు చెయ్యాలని తాపత్రయం, ఉద్యోగస్థులకుపండితులనిపించుకోవాలనితాపత్రయమూను.

కర్ణమహా: మా మాటో?

విదూ: తమమాట చెప్పనేల? అంతా యెరిగినదే! నాపదవి మీాద మీారు కన్ను వేశారు.

కృష్ణ: మొదటికే తెచ్చావూ!

విదూ: రామశబ్దంరాని నానామంత్రిచేత గీత ఉపదేశం చేయించడానికి తమరు తలపడ్డప్పుడు నాబిరుదులు నేను

తమకుసమర్పించక తీరదుగదా? (మహారాజు విదూషకునివైపు చూచి యేదో రహస్యము చెప్పును. విదూషకుడు కొంచెరపాటుతో నిష్క్రమించును)

కృష్ణస్వామి : (మాధవశర్మతో చిన్నగొంతుతో సహాస్యముగా, ప్రకటి) "ముఖే హారావాప్తిః" అన్న శ్లోకమువిషయమై మాధవ శర్మగారు ఒక చిత్రకథ చెప్పుతున్నారు.

కర్ణమహా : యేమిటండి ?

కృష్ణస్వామి : మరేమీ లేదు. ఆ శ్లోకం దాహాలాధీశుడైన కర్ణమహారాజును ఉద్దేశించి చెప్పినదట.

కర్ణమహా : యెంగిలిశ్లోకమూ మాకు సమర్పణ అయినది!

కృష్ణస్వామి : చాలామంది కవులు మనే వారు. యెంగిలిశ్లోకాల వల్లనే ప్రతిష్ఠ సంపాదిస్తారు.

రామశాస్త్రి : పరదేశికి యేలినవారియందు భక్తి యెలా వుంటుంది ?

కర్ణమహా : పేరు ఒకటయితే యిట్టి తారుమార్లకు అవకాశం వుంటుంది.

కేశవభట్టు : యేలినవారికి తెలియనిది లేదు. ఆ శ్లోకము మట్టుకు మిక్కిలి విలువైనది. చాలాకాలము కిందటనే రచితమయిన యెడల, ప్రభులయొక్క, పండితులయొక్క కర్ణగోచరము కాకుండునా ? బిల్హణకవి కొత్తశ్లోకం చెప్పే పాటి సామర్థ్యం లేనివాడు కాడు.

రామ : మంచిశ్లోకమన్నది తలచినప్పుడల్లా స్ఫురిస్తుందా?

(విదూషకుడు ప్రవేశించును.)

కర్ణమహా : ఈయన కాశ్మీర రాజుల ఆస్థానము యేలవిడచిరో యెవరికైనా తెలుసునా ?

రామ : మనవి చెయ్యడమునకు వీలులేని కారణము చెబు తారు.

కృష్ణ : తన్ని తగిలేశారని ఈ మాధవశర్మగారే చెప్పారు.

మాధవ : నేనా చెప్పాను ! తప్పుగా వినివుంటారు.

విదూ : ఈ కవిత్వం మాధవప్రణీతమయే వుండాలి.

కర్ణమహా : (కృష్ణ స్వామితో) యెందుకు ఉచ్చాటన ఐందో ?

కృష్ణస్వామి: కారణమంటూ విశేష కారణమేమీ లేదు. రాజు గారు వుంచిన వేశ్యసౌందర్యమును చూచి మనసు నిలవ బూనినారు కారట.

కర్ణమహా : ఐతే రసికులే.

విదూ : ఆమాటకొస్తే, ఇతర మహాకవుల తక్కువ యేమిటో! కృష్ణమిశ్రి చెప్పినట్లు యెంతటివాడికైనా...

శ్లో॥ సంతు విలోకన భాషణ
విలాస పరిహాస కేళి పరిరంభాః
స్మరణ మపి కామినీనామ్
అలమిహ మనసో వికారాయ.

కర్ణమహా : అందరికీ తెచ్చారా !

కేశవభట్టు : క్షమాపణ మనవి చేసి ఒక్కసంగతి తెలుపుచ్చు కుంటాను. బిల్హణుడు మహాపండితుడు. దేశదేశములు తిరుగును. అట్టివానిని అనాదరణ చేసినయెడల, అప కీర్తి చాటగలడు పండితులు శిక్షార్హులు కారు. "విద్వ ద్దండ మగౌరవం" అన్నాడు. నేరం యెంతవుంటూవున్నదో, వారు యెంతవరకు సమాధానం చెప్పుకోగలరో, అతిత్వ

న్వేషణంకూడా కర్తవ్యమేమో అని సందేహం కలుగుతూంది.

మాధవ: అయితే, తత్వాన్వేషణం చెయ్యనిదే ప్రభువులు శిక్ష విధించారనా, మీ అభిప్రాయం?

రామ: విష్ణ్వంశసంభూతులగు మహాప్రభువులు, అన్వేషణం అంటూ ఒకటి చెయ్యవలెనా నిజమును!

“సతాంహి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః॥”

విదూ: ఆ సిద్ధాంతం అందరి మెళ్ళకీ వురి అల్లుకోవడమే. యిప్పుడు ఒకాడి పీకకు తగిలిస్తే, రేపు మన పీకకే ఉరులు కోగల్లు. ఇదుగో నానామంత్రి వస్తున్నారు. నిద్రపోతూన్న వాళ్ళ పీకలు తెగ్గొయ్యడానికి యింత మహావీరుడు మరి లోకంలో లేడు. ఆ ధర్మసందేహమేదో ఆయన తీరుస్తారు.

(మంత్రి నానాయగార్ ప్రవేశించును.)

నానామంత్రి: మహాప్రభో! మహారాజకుమారికా వారికి భగవద్గీతలు ఉపదేశం చేయించడపు అభిలాష యేలినవారికి కలదని, శ్రీ మాతామహారాణివారితో నవుకరు మనవి చెయ్యగా మిక్కిలి సంతోషముతో వారు ఆమోదించారు.

కర్ణమహా: మీరు మనవిచేసిన తరువాత మరి వకలాగు యేల ఔను?

విదూ: పాంవిషం పాకేం తియ్యాలి.

(నానామంత్రి కోపముతో విదూషకునివైపు చూచును.)

కర్ణమహా: అతని మాటలు సరకు చెయ్యకండి.

విదూ : భగవద్గీత కాశీలోనూ, కాంచీపురంలోనూ అభ్యసించిన పంతులువారికి కోపం యెందుకు వుంటుంది ? అయినా నిజమైన మాటకు కోపం యెందుకు ?

కర్ణమహా : నిజమనేవి యెట్టిదో ?

విదూ : అనుదినం భగవద్గీత పారాయణంమట్టుకు చేస్తావుంటే ఆడే అబద్ధాలన్నీ నిజమౌతాయి. యిది వక శుద్ధక్రియ.

నానామంత్రి : యేమిటీ యీ మాటలకి అర్థం ?

కర్ణమహా : విదూషకుడి మాటలకు అర్థం ఆలోచిస్తారేమిటి ?

కృష్ణస్వామి : కొందరికి అతగాడి మాటలు ఆలోచించినకొద్దీ అర్థాలిస్తాయి.

నానామంత్రి : వెఱ్ఱికి వెయ్యిఅర్థాలు.

విదూ : కేశవభట్టుగారిని ఒక వెఱ్ఱిధర్మసందేహం బాధిస్తూంది. ఆయన వెఱ్ఱి తీర్చి, తరవాత నా వెఱ్ఱికి వైద్యం చేతురుగాని.

(కర్ణమహారాజు కనుబొమలెత్తి కేశవభట్టును చూచును)

కేశవ : నిజం విచారించి మరీ శిక్షవిధించటం ధర్మశాస్త్ర పద్ధతేమోయని సర్వజ్ఞులున్నూ, ధర్మస్వరూపులున్నూ అయిన యేలికల సమక్షమందు ఎంతో భయంతో మనవి చేసుకుంటున్నాను.

కర్ణమహా : యెంతమాటంటిరి; భయమేల? నేను రాజునైనను, కించజ్ఞుడను; రాజునౌటనే కించజ్ఞుడను అని అనవచ్చును. పండితులు, ప్రాజ్ఞులు వారివారి నమ్మకములను నా యెదుట ముచ్చటించుటకు వెరచిరేని, నేను రాజ్యమునకు అర్హుడనే కానే ?

కేశ : రాజాధిరాజ ! పండితరాజను శబ్దము నేలినవారికే చెల్లెను గ్రంథములు నెత్తిని మోయుటకు అస్మదాదులును కూడా మహాపండితులమే. అయితే, మోతచేతగాని, వాని గ్రంథము ఆత్మలకు అంటక, చదువులు ఒకతెన్నూ చర్యలు మరివకతెన్నూ అయి కామలోభాదులచే జ్ఞానాంధులమైన మాబోట్లకు, పండితశబ్దము యెట్లు చెల్లును ! లోకము పరిత్యజించి అడవుల్లో తపస్సుచేసే మునులకున్నూ లొంగని క్రోధాదులను నిర్జించిన యేలినవారే పండితులుగాని, ఈర్ష్య తీర్చుకొనుటకుగాను నిజమును కప్పి, ధర్మమును దాచి, అల్పమైన ఐహిక లాభముల నపేక్షించే మేము పండితులము మహారాజా ?

కృష్ణ : ఈ ముక్కలేమో యెవరికీ తెలియనట్లు ఉపన్యసిస్తూన్నారు. రెండుకళ్ళతోనూ చూశామయ్యా అని ఘోషిస్తూవుంటే, అట్టి బలవత్తరమైన సాక్ష్యాన్ని మీ పండితదూషణ యేలాకొట్టగలదో, నాకు బోధపడకుండావున్నది. ఛాందసానికిన్నీ రాజ్యతంత్రానికిన్నీ చాలాదూరం వుంది.

నానామంత్రి : నాతో దోషం వొప్పుకుంటేనే ! "ఆ తావళి మనేది తాతాజీ మహారాజావారు నేపాళంమహారాజుల వద్ద సంపాదించారు. దీనితో అర్జునుడు జపం చేసేవాడని ప్రతీతికూడా కద్దు. శివపూజాకాలమందు మహాప్రభువారు, నమస్కరించి, కళ్ళకద్దుకుని మరీ ధరించేవారు. మీయందు వుండే అసమాన గౌరవముచేత మీకిది అనుగ్రహపూర్వకముగా దయచేశారు. అది యెందుకు వక ఆస్థానపండితునికి బహుమానంగా యిచ్చావయ్యా" అని

నే నడిగితే, యేవంన్నాడంటే, "యీా కుళ్లుతావళానికి యీా దేశంలో కాబట్టి యింత మాన్యత కలిగింది. మా దేశంలో ప్రతి తుప్పనిండా ఏకముఖి రుద్రాక్షలే. తెగించి నాకు యింతబహుమానం చేసినందుకు మీా రాజు బెంగ బెట్టుకో లేదుగదా ?" అని నిర్మోహామాటంగా అన్నాడు. నా కంటూా ఆ మాటతో వొళ్ళు నీరు విడిచిపోయింది.

విదూ: యెప్పుడు యీా ప్రసంగం జరిగిందో ?

నానామంత్రి: నీ ప్రశ్నలకు సమాధానాలు నీలాటివాళ్ళే చెబుతారు.

కర్ణమహా: చిత్రం, కొందరికి యెలకంటే బెదురు; కొందరికి పిల్లంటే బెదరు; నానామంత్రిగారికి గౌతములంటే బెదురు.

నానామంత్రి: ఆమాట శలవివ్వవద్దు మహాప్రభో ! యేలిన వారూ అమ్మాజీవారూతప్ప లోకంలో నాకు బ్రహ్మ భయం లేదు.

విదూ: యముడి భయవేఁ లేనివాడికి, బ్రహ్మభయం యెలా వుంటుంది !

కృష్ణ: వారు చెబుతూవున్న సాక్ష్యం అబద్ధవోఁ నిజవోఁ కొసాకూా వినరాదూా ?

కర్ణమహా: తరువాతండి ?

నానామంత్రి: తరవాతేవొచ్చి, మళ్లీ అన్నాను "నారాయణ భట్టుగారి విద్వను మహారాజులు తగినట్టు గౌరవించ నట్టున్నా. యీా విషయంలో మహారాజుల లోపమును మీారు యెత్తిపొడిచి సవరణ చేసినట్టున్నా లోకానికి అర్థం

కాగలరు. మహారాజులు శాంతులని, యిలాగ నిరాదరణ చెయ్యరాదు" అని వేయివిధాల అతని మేలుకోరి, బోధ చేస్తే "రాజులకేం తెలుస్తుంది విద్యల విలువ? రాజులు విద్యాఘూకా" లన్నాడు.

విదూ: యీపాటికి బిల్హణుడు వూరి పొలిమేర దాటి వుంటాడు. యెన్నిగోత్రాలు కోసినా ప్రతిబంధకం లేదు.

నానామంత్రి: అలా అన్నట్టయితే, యిప్పుడు ఆయన్ని పిలిపించండి. యీ ఆస్థానమందు రుజువిప్పిస్తాను.

విదూ: అదుగో నారాయణభట్టుగారు కలిసి ఆయనే వస్తున్నారు. మీరు తలచేటప్పటికి బిల్హణుడు ఆకాశాన్నించి వుట్టిపడ్డట్టుంది. కాయసిద్ధుంది కాబోలు.

(నానామంత్రి కనుకన్నై ఆస్థానం తేరిపారి చూచును. అలా చూచుచుండగా కర్ణమహారాజు స్వర్ణ పేటికలోని రుద్రాక్షమాలతీసి ధరించును.)

నానామంత్రి: వైదికులు హద్దుమీరాద వున్నారు. ఉచ్చాటనా శాసనమైనప్పటికి యెలా తోసుకువస్తున్నాడో! (ఉత్సాహముతో) అదిగో నారాయణభట్టుగారి మెడలో రుద్రాక్షమాల!

విదూ: ఆ చిత్రవేం జూస్తారు, ఈ చిత్రం చూడండి. యిదుగో ప్రభువుల మెడలో ప్రభువుల రుద్రాక్షమాల!

(నానామంత్రి ఆశ్చర్యముతో మహారాజువైపు చూచి తిరిగి నారాయణభట్టు కంఠమును పరికించుచున్న సమయంలో బిల్హణుడు దగ్గిరగా రాగా కర్ణ మహారాజు నిలుచుండును. అందరూ నిలుతురు. అవమాన దుఃఖంతో పోల్చుకోలేక, నానామంత్రి కూడా నిలుచును.)

కేశ: బోధపడ్డది "యీ హారము రాజపండితుడైన కర్ణమహారాజు కంఠమును అలంకరించినది" అని బిల్హణకవులు

అన్నప్రుడు దామాళాధీశుడగు కర్ణుని ఉద్దేశించి చెప్పివుందును. కానలేకపోతిమి.

విదూ: యింతసేపటికి తర్కం పనిచేసింది.

కృష్ణస్వామి: అదిటండీ. అప్పైతే మనమందరమూ బిల్హణులకు అపరాధం చెప్పుకోవలసి వుంటుంది.

కేశ: చుక్కానికి న్యాయంగా పోతుంది స్వామిగారి మనస్సు. కలుషం లేదు.

కృష్ణ: పండితుడికి కలుషంవుంటే, మరి పండితుడేవిటండీ. ఆ మహారాజును చూసైనా నేర్చుకోవద్దా ?

కర్ణమహా: (బిల్హణ నారాయణభట్టులతో) దయచెయ్యండి. దగ్గరగా కూచోండి. (అందరును యథ స్థలములయందు వారు కూర్చుందురు.)

నానామంత్రి: (మాధవశర్మ చెవిలో) నామాటలుగానీ విని వుండరుగద ?

విదూ: అప్పుడు చాలాదూరంగా వున్నారు; వినివుండరు, కర్ణపిశాచి వుంటే తప్ప.

కృష్ణ: నీకు వున్నట్టుంది కర్ణపిశాచి. యెక్కడలేని రహస్యాలు యెక్కలాగుతావు.

కర్ణమహా: (బిల్హణుని ఉద్దేశించి) కవివర్య! అజ్ఞానానికి అంజనం యేమిటి ?

బిల్హ: రాజపదవికి నైసర్గికమైన మహాంధకారమును తొలగించి, నిశ్చలమైన జ్ఞానోదయమువల్ల అరిషడ్వర్గమును తలచూపనివ్వకుండా తరిమిన, తమవంటి సత్పురుషుల సహవాసమే అజ్ఞానాంజనము మహారాజా! పండితసామా

న్యమునకు విద్వన్నది జ్ఞానసాధకం కాక మాత్సర్యహేతు వైయే యుండును.

విదూ : నానామంత్రిగారి అభిప్రాయమూ అదే. నాటిముట్టుకు సాధనం లేకుండానే సాధ్యం సాధించారు.

కర్ణమహా : జ్ఞానాలోకమునకు ఉత్పత్తిస్థానము సూరులు. ఆ సూరుల సంసర్గంవల్ల నృపనామక పాషాణములకు కూడా కాంతి ఆపాదన ఔతుంది. నాకుగల స్వల్పజ్ఞానము అమ్మాజీవారి శిక్షవల్లనూ, మహాపండితుల సహవాసము వల్లనే కలిగినది. స్వామి మాకు బాల్యగురువులు. యిప్పుడు తామ అందరూ మాకు గురువులే. (మంత్రితో) మంత్రివర్యా, రేపటినుంచి బిల్హణకవులు మహారాజ కుమారికావారికి గీతోపదేశం చెయ్యడముకు అభ్యంతర మేమిటా ?

నానా : అభ్యంతరం అనగా అభ్యంతరం యెందుకుంటుంది మహాప్రభో !

కర్ణమహా : అయితే అమ్మాజీవారితో విన్నవించి వస్తాము. (లేచును అందరు లేచుచుండగా) కూచోండి పెద్దలకు శ్రమ యేల?

(నిష్క్రమించును. పండితులు చెదిరి గుంపులు గుంపులుగా మాటాడుదురు.)

నానామంత్రి : (మాధవశర్మతో) అడ్డంగా తిరిగిందే !

మాధవశర్మ : అదే నేను యోచిస్తున్నాను. ప్రవాహానికి యెదురీది ప్రయోజనం లేదు.

నానామంత్రి : అయితే వాడితో కలిసిపోతానంటారా ఏమిటి?

మాధవ : ఆడుకోమన్నా, పట్టుకోమన్నా కనపడనప్పుడు యేం జేయను ?

నానా : మీరు భయపడక నిలబడిమాత్రం వుండండి. వీడికి ఉచ్చాటనమంత్రం మహారాణీవారితో టివుపదేశంచేస్తాను. చూడండీ, ఆస్వామి, వాడితో యెంత ఆసక్తితో ముచ్చటిస్తున్నాడో! మనవాళ్ళలో కట్టులేదు.

మాధవ : పండితులు కుక్కల్లాగ కొట్లాడబట్టేకదండీ, పరాయి వాళ్ళు డబ్బు తన్నుకుపోతున్నారు! (బిల్హణుడున్న తావునకు వెళ్లును.)

నానా : (రామశాస్త్రితో) అస్త్రం అడ్డుదిరిగిందండీ.

రామశాస్త్రి : తాము కొంచం అతి ఆచరిస్తారు.

నానామంత్రి : యేంచేయను, శాస్త్రుర్లుగారూ? భగవంతుడు తీక్షణమైనబుద్ధిని యిచ్చాడు. అది విడద్దదంటే, పట్టడానికి నాకే అసాధ్యమైపోతుంది. యిహ వూరుకుందునా?

రామ : తాము ఊరుకుంటే యేలాగ? బిల్హణుడు కుమారికావారిదగ్గర ఆనుకున్నాడంటే వారిని కలశమహారాజుకు వివాహం చేసే ప్రక్రియ నడిపిస్తాడు. ధారాపతినిగూర్చి మనం యిన్నాళ్ళాయి చేసినప్రయత్నం విఫలమౌతుంది.

నానా : చూశారా మొన్న కాశ్మీరరాజుతండ్రి అనంత భూపాలుణ్ణి, రాజుయెదుట భట్టువాళ్లా యెలా పొగిడాడో!

రామ : దానికి ప్రతిక్రియ అమ్మాజీవారి దగ్గిర తాము కల్పించాలి.

నానా : రాజు అసాధ్యుడుగద!

(బిల్హణుడు నానా మంత్రి వద్దకువచ్చును.)

బిల్హ : (నానామంత్రితో) తాము పంపిన ద్రాక్షఫలముల వంటి ఫలములు మా దేశం విడిచిన తరువాత తినలేదు. పంపిన మీ దయకు చాలా సంతోషించాను.

కృష్ణస్వామి : (ఒక పాటి మెల్లగా, గాని వినబడునట్లు) ముద్దికాల్చి, మూతికి వెన్న రాసేవాడు, యింతవాడు మరిపుట్టబోడు.

నానా : (బిల్హణుని మాత్రముగా కొనిపోయి) పండితులలో యెంత ఓర్వలేనివాళ్ళయినా వుంటారు. వీళ్ళ నెవ్వరినీ నమ్మకండి. అందులో మాధవశర్మ బహుదుర్మార్గుడు. యామినీ దేవికి మీరు విద్య చెప్పబోతారని, ముక్కంటా నోటంటా యేడుస్తున్నాడు. ఎప్పుడో మీమీద నిందయేదో తీసుకొస్తాడు. జాగ్రతమీద వుండండి !

(బిల్హణుడు తన మొలలోనున్న పూరకను చూపించును.)

నానా : మా నాయనగారికీ మీ నాయనగారికి చాలా స్నేహం ఉండేది తమకు తెలిసిందో లేదో మా తండ్రిగారు జ్యేష్ఠకలశుల గుణవర్ణన తరుచుగా చేస్తూవుండేవారు. వారు రెండు పర్యాయములు కాశ్మీరరాష్ట్రానముకు రాయబారిగా వెళ్లారు. అప్పట్లో తెచ్చినదే మా తోటలోని ద్రాక్ష.

బిల్హ : అలా చెప్పండి. అందుచేతనే ఆస్వాదు కలిగింది.

నానా : యిటుపైని అనుదినం తమకు పళ్ళు పంపి మరీ అమ్మాజీ వారికి పంపుతాను. మన తండ్రులు స్నేహితులైనందుకు యీనాటికి తిరిగి మనంకూడా స్నేహితులం కావడము కేవలము భగవత్సంకల్పంగాని ఒండు కానేరదు.

బిల్హ : కృతార్థుడను. స్నేహంయొక్క విలువన్నది దేశదేశాలు తిరిగే మాబోటి పండితులకే తెలుసును.

నానా : యిక్కడ వున్నంతకాలం మీకు యేసహాయం కావలసినా అరమరలేక, యీమిత్రుడివల్ల పుచ్చుకోండి. అమ్మాజీ

వారి ఆగ్రహం మీయందు వున్నప్పటికీ నా ప్రాణం వున్నంతవరకు, మీకు అడ్డుపడతాను.

బిల్హ : నావిషయమై ఒకరికి హాని రాకూడదు. యేమి ఆ ఆగ్రహకారణము ?

నానా : మహారాజ కుమారికావారికి తాము విద్య చెబుతారనే.

బిల్హ : మహారాజవారి మనస్సు మళ్లించ లేరో ?

నానా : వారిక్రోధం అనివార్యం.

బిల్హ : తమసలహా యేమిటి ?

నానా : యేం చెప్పను ? యెప్పటికైనా వారివల్ల మీకు హాని వుంది. రాజుల క్రోధాలు మహాచెడ్డవి. దేశం విడిచి వెళ్ళిపోవడం వక ఆలోచన. మీరు యెక్కడికి వెళ్ళినా రాజులు నెత్తినిపెట్టుకుంటారు గాని, మీరు వెళ్లిపోతే ఆ దురదృష్టం ముఖ్యంగా నాది. కుమారికావారితోపాటు నేనుకూడా తమవద్ద భగవద్గీతలు నేర్చవలెననుకున్నాను.

బిల్హ : నావల్ల భగవద్గీతలు వింటే, మీరు ఉద్యోగం మానుకొంటారు. మహారాజ కుమారికావారు వివాహం మాని, సంసారం పరిత్యజిస్తారు.

నానా : నేను నాలుగు యేళ్లాయి ఉద్యోగం చాలించుకుని, భగవంతుడి సేవలో కాలం వెళ్లబుచ్చుదామనుకుంటు న్నాను. నేను ఉద్యోగంలో వుంటేనేగాని రాజ్యానికి అపాటం వస్తుందేమో అని మహారాణీవారైతేనేమి, మహారాజు అయితేనేమి నన్ను నిర్బంధిస్తున్నారు.

బిల్హ : మహారాయుందు మీ తాతా మహారాణివారికి అంత వాత్సల్యత ఉండగా నాకు హాని రాకుండా మీరు వారిని మళ్ళించలేరో ?

నానా : మహా పండితులూ, మహా కవులూ ! తమకు నేను చెప్పవలసిన ధర్మాలు కలవా ? రాజులు త్రాచుపాములు ! పట్టుదలేగాని లాభనష్టాలు గణించరు.

(సభనుంచి యిద్దరు భూషితులగు స్త్రీలు బంగారు పళ్ళెములలో సంక్రందన తాంబూలములూ పచ్చలహారమూ తెచ్చి నమస్కరించి బిల్హణునికి సమర్పింతురు.)

ఒకతె : అమ్మాజీ మహారాణీవారు తాము వారికి అంకితముగా రచించిన గీతమునకు సంతోషించి వారు ధరించే ఈ పచ్చల హారము తమకు దయచేయించిరి. ధరించి సముఖమునకు రండి.

(బిల్హణునితో నిష్క్రమింతురు)

నానా : (రామశాస్త్రిని, మాధవశర్మ ఉన్నచోటికి వచ్చి వారలతో) ప్రభువులు ఒకమాటమీదను నిలిచివుండరు.

మాధవ : శకం తిరిగింది.

రామ : చక్రం యెప్పుడూ తిరుగుతూనే వుంటుంది. మరో తిరుగులో, మీదు క్రిందికి దిగుతుంది. విచారమేలా ?

( తెర )



# బిల్హణీయము

## రెండవ అంకము

(నారాయణభట్టు యింటిసావిడి : నారాయణభట్టూ, శిష్యుడు వామనశెర్మ ప్రవేశింతురు.)

నారా : అరవైయేళ్లు దాటి, యిప్పుడు కవిత్వం నేర్చుకోవాలంటే, యెలా సాధ్యవౌఁతుంది ! రాజుకు కవిత్వం పిచ్చి ఘట్టిగా పట్టుకుంది ... యీ కవిత్వవఁన్నదానికి వొకతోవా, తెన్నూ, సబబూ, సందర్భఁవూ కానరాదు. ఏదీ బిల్హణుడు చెప్పిన పద్యంలో మొదటి వాక్యం చదువూ.

శిష్యు : (చదువును) "అంకం కేపి శశంకిరే జలనిధేః పంకం।" చంద్రుల్లో కళంకమును, కొంతమంది సముద్రంలో బురదగా భావించారు.

నారా : కొంతమంది మనుష్యులు, చంద్రుల్లో వుండుకున్నషు వంటి మచ్చ యేదైతే వున్నదో దాన్ని సముద్రపు బురద అనుకున్నారని కదూ, కవి అభిప్రాయం? ఏ వెఱ్ఱివాఁడైనా యెన్నడైనా, అలా అనుకుంటాఁడా ? బిల్హణుడు మహాపండితుడేగాని, కవిత్వంలో దిగగానే, అసత్యం కల్పించాడు. ఏవఁంటావ్ ?

శిష్యు : ఔనండి.

నారా : ఇక పద్యం యెలాఅల్లాడో చూదాం..."అంకం"అనే ఒకమాటతీసుకున్నాడు. దానికి అనుప్రాసార్థం "పంకం"అనే

మాటలాకని యెత్తాడు...అటుపైని "ఆ అంకానికీ, యీ పంకానికీ, యెలాగయినా అతికడం!" అని ఆలోచించి, ఏం యెత్తుయెత్తాడంటే, పంకం సముద్రంలో పుంటుందిగదా, చంద్రుడున్నూ సముద్రంలోనే పుట్టాడుగదా, ఆ పుట్టడంలో బురద యేమాత్రమైనా వొంటికి అంటుకుండా వుంటుందా అని యోచించి, అంకపంకాలకి లంకె వేశాడు. అంతేకదూ?

శిష్యు: అంతేనండి.

నారా: సరేగాని, బురదంటూ వొకవేళ తగిల్నా, యెప్పుడయినా కడుక్కోడా? యిదంతా అసంబద్ధంగా కానవస్తోంది.

శిష్యు: అవునండి.

నారా: అయితే మనకూడా వొక ప్రాసముక్క చూచి పెట్టు; శ్లోకం అల్లుదాం.

శిష్యు: 'శంఖం' బాగుందండి.

నారా: బాగుంది. అయితే శంఖానికీ చంద్రుడికీ, యెలాగరా అతకడం?

శిష్యు: ఎలాగనా అండి, తెలుపు గనుక ఉపమానం చేదాం.

నారా: అంకం వొకటి తగలడుతూవుందికదూ! శంఖానికి కళంకమేదీ?

శిష్యు: కొంచెం మసిపూస్తే కళంకం సాధ్యమవుతుందండి.

నారా: ఓరీ, మూర్ఖుడా! శంఖం పనికిరాదు. మరోమాట చూడు

శిష్యు: శంకా?

నారా : శంకా? ...శంకా? ...శంకా...కళంకానికి శంకెలా తగిలించడంరా? ఆఁ, కుదిరింది, రాయి. (నారాయణభట్టు చెప్పును; శిష్యుగు రాయును.)

"అంకం కిమితి శశాంకే।
కథమిహ నృణాం విజాయతే శంకా॥"

"శశాంకుడిలో వున్న మచ్చ యేమిటని మనుష్యులకు శంక యెలాగు పుట్టగలదు?"

మహాబాగా వొచ్చిందిరా, శ్లోకం; యేవంటావు.

శిష్యు : బాగానే వుందండి.

నారా : మహా, మహా అనాలి. ఒట్టి బాగుండడంకాదు. మహా బాగుందను. మొట్టమొదటికే తాళంపట్టాం. అసగా, శంకకే శంక తగిలించావన్న మాట. ఈ పద్యం చూస్తే, రాజు డంగైపోతాడు. ఓమూల శశాంకుడని తానేఅంటూ యింకా అంకవన్నది యేమిటీ, అని యెంత బుద్ధితక్కువ మనిషైనా అడుగుతాడా?

శిష్యు : (నవ్వు ఆపుకుంటూ) యెవ్వడూ అడగడండి. ఉత్తరార్థం శలవియ్యరా?

నారా : ఇంకా ఉత్తరార్థంకూడా వుందిట్రా! యేమి సాహసం; చెప్పవలసిన అభిప్రాయం అంతా చెప్పేశాంగదా!

శిష్యు : 'శంకర' అనే మహామాట తీసుకుని శంకరుడి శిరస్సు మీద చంద్రుడు వున్నాడు గనక, ఏదైనా హావా కల్పిస యెత్తితే సరండి.

నారా : అసలు శంకనే కొట్టిపారేశింతరువాత, మరి కల్పనకి

బాగా నొకటి వుంచావా ?! ఇక తోసి కనసుంటదే...కన పడదే...ఆహాఁ దొరికింది, రాంగు !

(నారాయణభట్టు చదువును, శిష్యుడు [illegible]

"అంకం కిమితి శశాంకే
కథాపి స్వాణాం నజాయతే శంకా !!"

"శశాంకుడిలో అంకం యేమిటి? అనే శంక సమలకు ఎన్నడూ కలుగనేరదు" ... ప్రశ్నోత్తరంగా వొచ్చిందిరా ! [illegible] మంటావ ?

శిష్యు : ([illegible]) [illegible].

నారా : అట్టి శంక, యెన్నడూ పుట్టనేరదని ప్రథమార్థంలో ప్రశ్నకు సమాధానం మాబాగా కుదిరిందిరా. ఏదీ పద్యం కలిపి చదువు.

శిష్యు : (చదువుతూ)

"అంకం కిమితి శశాంకే
కథమిహ స్వాణాం విజాయతే శంకా ।"

నారా : తగలేశావురా, బంగారంలాంటి పద్యం ! కొంచెం రాగ వరసపెట్టి యేడవరాదూ ?

శిష్యు : (రాగవరసతో) అంకం కిమితిశశాంకే (అప్పైని చవనబాలక విరగబడి నవ్వును)

నారా : ఎందుకునవ్వుతావు? ఓరిపాడుగట్టా! పద్యం బాగుంది కాదంటావా యేమిటి! (నానామంత్రి ప్రవేశించును) వూరుకో! వూరుకో! నానామంత్రొస్తున్నారు. ఆ పత్రం దాచెయ్యి.
(గురు శిష్యులు నిలుతురు)

నానా: యేమిటండోయి, శిష్యుడిచేత రాయిస్తున్నారు?
(శిష్యుడితో) యేమి అబ్బాయీ! కనబడ్డవేఁ మానేశావూ?
నారా: యేమీ లేదండి. గ్రంథం రాయిస్తున్నాను.
నానా: (శిష్యుడితో) యేదీ ఆ రాసింది చదువూ.
(శిష్యుడు తలగోక్కుంటూ గురువ్వేపు చూచును.)
నానా: (శిష్యుడిచేతులో పత్రం లాక్కుని చదువును. తల యెత్తి నారాయణభట్టుతో) యెవరు చెప్పారండీ యీ శ్లోకం?
నారా: మా శిష్యుడూ.
శిష్యు: యింతికన్న బాగా చెప్పగలనండి.
నారా: యేడిశావూరుకో.
నానా: శ్లోకం మట్టుకు మహా బాగావుందండి.
నారా: బాగుందంటారా? నాకు అలాగే తోచింది.
నానా: బాగుండడవఁంటే ఆలాగా యిలాగా అనుకున్నారా యేమిటి? బిల్హణుడి పద్యాన్ని పగలగొట్టారే!
నారా: మా శిష్యులు చెప్పమని పీక్కుతింటే యేదో చెప్పి చూడావఁని చెప్పాను.
నానా: తర్కం కురిపించిపోతిరే. యిఖ బిల్హణుడు తలదాచుకోవాలి
నారా: పద్యం అంత ప్రశస్తంగావుందని శలవిస్తారా?
నానా: 'శలవియ్యడం' కాదు 'మనవి' అనండి. మీ శిష్యకోటిలోవాణ్ణి, ఆమాట మరిచిపోకండి. ఆ శ్లోక ప్రాశస్త్యానికి, అవధిఅంటూ వుందండి? మీరే కవిత్వం చెప్పడం ప్రారంభిస్తే, ఈ కవీశ్వర్లంతా సూర్యుడిముందర చుక్కల్లాగ చకాపికలై పోరా?

నారా: శాస్త్రాలు చదువుకున్న మాబోట్లకు కవిత్వం చెప్పడం వస్తున్నది, తక్కువ పనికాదండీ!

నానా: ఈరోజుల్లో తక్కువ విద్యలకే, తక్కువ మనుష్యులకే ఎక్కువ విలువ. "రాజద్రోహీ! తులువా!" అని, కాశ్మీరం నుంచి, అక్కడి రాజులు వెళ్ళగొట్టిన యీ బిల్హణుడికి మహాప్రాజ్ఞులైన మన మహారాజులే, మీ అందరికంటే ఎక్కువ గౌరవం చేస్తున్నారు, కారా?

నారా: బిల్హణులను కాశ్మీరంనుంచి వెళ్ళగొట్టారండీ?

నానా: కూచోండి, చెబుతాను (శిష్యుడితో) అబ్బాయీ! మీరు కొంతసేపు అవతలకు వెళ్ళి చదువుకోండి, చదువు వంటి వస్తువ లేదు.

(శిష్యుని వెళ్ళమని గురువు సంజ్ఞ చేయును. శిష్యుడు పోవును. నారాయణభట్టు నానామంత్రి కూర్చుందురు.)

నానా: విన్నారా, కలశమహారాజు వొక వేశ్యను వుంచారు. ఆ వేశ్యమీద బిల్హణుడు ఒక ప్రబంధం చెప్పగా, కలశ మహారాజు సంతోషించి, బిల్హణుడికి ఆ వేశ్య దగ్గర ప్రవేశం కలుగజేశారు. యీ రాజులకి దయపుడితే, చెయ్యతగిన మర్యాదా, చెయ్యడగని మర్యాదా కానరు. ఆపైని జరగవలసిన పనియేదో జరిగింది; దాంతో యీ తుంటరి కవికి ఉద్వాసన అయింది.

నారా: యింత విద్వాంసుడుగదా, అలా జరిగి వుంటుందండీ? పండితుడన్నవాడు క్షుద్రులవలె నీచవృత్తులకు దిగడు. కిట్టక ఎవరో యీ కథ కల్పించివుంటారని నా మతం.

నానా: మీకు లోకం తెలియదు. అట్టి సంశయమే మీకుంటే

యీ రంకుశ్లోకం చదివి నిజానిజాలు కనిపెట్టండి. దస్తూరీ యెవరిదో పోల్చారా? (పత్రం వొకటి చేతికి యిచ్చును.)

నారా: యేమిటండిది? దస్తూరి బ్రాహ్మణులదే అనుకుంటాను. (చదువును.)

"అలమతి చపలత్వా త్స్వప్నమాయోపమత్వా
త్పరిణతి విరసత్వా త్సంగమేనాంగనాయాః
ఇతి యది శతకృత్వ స్తత్వ మాలోచయామ
స్తదపి న హరిణాక్షీం విస్మర త్యంతరాత్మా"

ఈ కవిత్వమూ, శృంగారం అన్నవి యెంతటి పండితుడి కైనా కళంకం తేకమానవు. అందుచాతనే మా తండ్రి గారు కవిత్వం చెప్పబోయేవుసుమా, చెడతావని శల విచ్చేవారు. నే చెప్పినశ్లోకం చింపెయ్యండి.

నానా: యిది చింపవలసిన శ్లోకంకాదు. మహారాణీవారికి చూపిస్తాను. బ్రాహ్మణ్ణి కొట్టగలిగినపాటి కవి, మన ఆస్థానంలో వొకరంటూ వున్నారుగదా అని వారు యెంతో సంతోషిస్తారు. ఈమూలంగా మీపైని మహారాణీవారికి కలిగిన ఆగ్రహం కొంత మళ్ళగలదు.

నారా: నామీదే ఆగ్రహం! యేం, నాయనా! యేం నాయనా! యెన్నడూ యేపాపం యెరగనే!

నానా: మీఅంత అమాయకమైన బ్రాహ్మణ్ణి నేను ఎక్కడా చూడలేదు. ఊరందరికీ తెలిసినమాటైనా మీకు తెలియదు.

నారా: నావంటి బీద బ్రాహ్మడియందు ఆగ్రహానికి కారణ మేమిటి నాయనా?

(కేశవభట్టు ప్రవేశించి, యిటు అటూ చూచి, యెవరినీ కానక ఒక మూల కూచుని పుస్తకపత్రాలు తిరగవేస్తూ వుండును. కొంతసేపటికి రుద్రాక్షతావళీమూ, ఒక పత్రమూ పట్టుకుని, నానామంత్రిన్నీ, సంతోషంగల ముఖంతో నారాయణభట్టున్నూ ప్రవేశింతురు. వీరు, మూల కూచున్న కేశవభట్టును చూడరు.)

నానా : యిటుపైని బిల్హణుడితో కలియకండి. మాట్లాడ్డం కూడా తప్పించుకోండి. రుద్రాక్ష తావళం యేమైపోయిందని యెవరడిగినా, పోయిందనండి. రాజడిగితే అమ్మేశాననండి.

కేశవభట్టు : (ముందుకు వచ్చి నిలిచి) యీ అబద్ధాలు ఆడవలసిన అవసరం యేమిటండి ?

నానా : మరేం లేదు. నారాయణభట్టు ధనికులు కారు. పిల్లల వాళ్ళు అక్కగారి వంటను అట్టే హంగు లేదు. అందుచేత యీ రుద్రాక్షతావళం విక్రయించి, ఆ సొమ్ము పెట్టి బంగారంకోసమని నాకు అక్కగారి శెలవు కాగా, కానులు తెచ్చి యిప్పుడే దాఖలు చేశాను.

కేశ : కావొచ్చును. కాని బిల్హణులతో కలియకపోవడానికీ, మాట్లాడకపోవడానికీ కారణమేముందునో కొంచెం శెలవు దయచేయిస్తారా ?

నారా : వేశ్యమాట మీకు తెలియలేదు కాబోలు ?

కేశ : వేశ్యమాట యేమిటండి ?

నారా : బిల్హణులు, కలశమహారాజులు వుంచిన 'వేశ్యతో స్నేహం లావుచేశారట. అందుచేతనే వారు దేశంనుంచి తోలివేశారట.

కేశ : ఏం దుష్ట యీ కల్పన కల్పించావండీ ! (నారాయణభట్టు నానామంత్రివేపు చూసి వూరుకొనును.)

కేశ : (నానామంత్రితో) తమరు యిప్పుడు దయచేయించినన్ని కాసులు నేను తమకు దాఖలు చేస్తాను. భట్టుగారికి నేను చాలా సొమ్ము బాకీవున్నాను, రుద్రాక్ష తావళంయొక్క విలువ అన్నది ఆ బంగారంలో లేదండి. ఆ మాల అమూల్యమైనది; అది యిలా దయచెయ్యండి, వారి కంఠమందు తిరిగీ వుంచుతాను.

నానా : అలాగయితే నేనే వుంచుతాను. (మాల నారాయణభట్టు మెడ వుంచబోవును.)

కేశ : తమ కంత శ్రమెందుకూ ? నేనే వుంచుతాను. (కేశవభట్టు మాలను పట్టుకుని తాను వుంచ ప్రయత్నించును.)

నానా : నేను వుంచితే తప్పా !

కేశ : తమరు తగిలించవలసిన సూత్రం యెప్పుడో ఒకప్పుడు మా అందరికీ వుండనేవుంది.

(కేశవభట్టూ, నానామంత్రి తావళంతో పెనుగులాడుతూ వుండగా తావళం తెగునని భయంచేత, నారాయణభట్టుగూడా తావళము పట్టుకొనును. ఇంతలో బిల్హణుడు ప్రవేశించును. ముగ్గురూ పట్టు వొదలగా, తావళమూ, నానామంత్రి చేతి పత్రమూ, నారాయణభట్టు చేతి పత్రమూ నేల పడును.)

బిల్హణుడు : (తావళమును, పత్రములను యెత్తి) యేమి యీదురంతం ? ఈ పండితాగ్రేసరుడికి యెట్టి పాటువచ్చినది ! ఈ ఉత్కృష్ట మాలకు యెట్టిపాటువచ్చినది! (ఒకపత్రము చదివి) ఇది నానా

మంత్రిగారి కవిత్వం కానోపును. (రెండవ పత్రం చూసి, ఆశ్చర్యపడి) యిది యిక్కడికి కేలావచ్చింది?

కేశ: యేమిటండి ఆ పత్రం?

బిల్హ: (ప్రత్యుత్తర మివ్వక) యిక్కడ కేలావచ్చెను, యీా పత్రం?

నారా: చెప్పవద్దని నానామంత్రిగారు, నాచేత ఘోరమైన ప్రమాణం చేయించారు.

నానా: (బిల్హణుడి చేతులు తన చేతులలో పట్టుకొని) క్షమధ్వం! క్షమధ్వం!

బిల్హ: "క్షమధ్వం" యేమిటి?

నానా: నావల్ల గట్టి పొరపాటు వచ్చింది. క్షమించండి. తమ వంటి మహాపండితులకు ఆగ్రహంవన్నది వుండదు. ఈ శ్లోకం కాశ్మీర మహారాజులు వుంచిన వేశ్యను ఉద్దేశించి తాము రచించినారని తమ శిష్యు డొకడు తెచ్చి నాకు చూపించాడు. దాంతో నాకు అనుమానం కలిగినమాట సత్యం. అనుమానంకలిగి తమతో సంబంధం వొదులు కొమ్మని, నారాయణ భట్టుగారితో నేను చెప్పినమాటా సత్యమే. వారి మంచికోరి ఆలాచెప్పాను. అంతేగాని మీాకు అపకారంచేదామని కించిత్తుఅయినా నాఅభిప్రాయంకాదు. ఆ సోమనాథుడు సాక్షి. అబద్ధమాడితే నా నెత్తిమీాద ఆకాశవంతపిడుగు పడిపోవాలి. తమవంటి మహానుభావుల విషయమై క్షుద్రులు చెప్పినమాటలు నమ్మడం బహు పొరపాటు. కేశవభట్టుగారు యీా వేశ్యకథ అంతా శుద్ధ

యీా దేశంలో వుంటాం. లేకుంటే, దేశాంతరం పోతాం. మేము అల్పులం. తాము ఆస్థానంలో చాలివున్నారు. వ్యవహారస్థితి యెప్పుడు యేరీతిని వుంటుందో తెలియదు. ఈ తావళం తాము వుంపించండి. ఈ సంగతి మేం యెవరికీనూ చెప్పం. మేం పండితులం; అనేది వొక మాటా, జేసేది ఒకపనీ కానేరదు. మా మా స్వభావాలు కూడా, యీా పాటికి తాము గానే వుంటారు.

నానా: రామా రామా! తావళం నాకా_వాలనుకున్నారా యేమిటి? అక్క గారు ముచ్చటపడ్డారుకదా అని కాసులు తెచ్చాను. మీా వుభయులకీ నా కంఠంలో ప్రాణం వుండగా హానిరాకూడదు. మీా నాయనగారికీ, మా నాయనగారికీ ఉండే స్నేహమైనా ఆలోచించుకోనా? పండితులంటే నాకు ప్రాణం కాదా? నేను శుద్ధ జయనుణ్ణి అనుకున్నారా యేమిటి? అక్క దగ్గర శెలవుపుచ్చుకొని వెళతాను. మీా యోగ్యత వేరే నాతో చెప్పాలా!

(తెర)



# విశ్వాసఘాతుకము

## * రెండవ అంకము

### స్థలము

అనిహిల్ల పట్టణమునకు కొంచందూరంలో సరస్వతీ నదీతీరమందు కాశ్మీర రాజపుత్రులు వలసవచ్చి విడిసిన పేట. ఒక ఉద్యానవనముమధ్య ఆ కాశ్మీరుల యజమానిన్నీ, కాశ్మీర మహారాజులకు బంధువున్నూ, ఒకప్పుడు కాశ్మీర రాజ్యములో సామంతరాజున్నూ అయిన చంద్రవర్మ అనే రాజుయొక్క భవనము. తోట మిక్కిలి రమ్యమైనది.

చంద్రవర్మ శూరుడు, విద్వాంసుడు, లోకానుభవము కలవాడు. మహమ్మదు ఘజినీ సోమనాథక్షేత్రమును కొట్టి నప్పుడు ఈయన కుమారుడు ఇంద్రవర్మ, యుద్ధంలో మృతి పొందెను. ఇంద్రవర్మకు రణసింహుడను పంధొమ్మిదియేళ్ళ ప్రాయంగల ఒక కుమారుడును, పదహారేళ్ళ ప్రాయము గల కుమార్తెయును కలరు.

చంద్రవర్మగారి భవనమునకు సామీప్యములో ఆ యుద్యానవనములోనే ఒక కొలనువద్దున ద్రాక్షతీగలల్లిన మంటపములో చిత్రాసనముమీద జమిలిస్తంభములకు చేర్చిన దిండును చారబడి బిలహణుడును, ఎదట మరివక చిన్న చిత్రాసనముమీద రణసింహుడుకూచునియుందురు.

---

* ఇది అప్పారాయకవి చిత్తుప్రతిలోని భాగం. మతము, కవిత్వ తత్వములను గూర్చిన విచారణ యిందు కలదు. ఇది సాహితీపరులకు ఉపక రించగలదని యీ సంపుటిలో సంతరించాము.

బిల్హణుడు :

అస్యాశ్చర్యమయస్య మస్త్రిగతయః సైన్యంతరంగైరపి,
జ్ఞాయన్తే న విధేరివాతికుటిలా నైవగ్రసీమా భువః
క్రూరాశ్చ స్తే ప్రతిభూభృతాం వసతయః త్వంగత్తురంగావళి
విక్షోభ్యక్షేల ఖురాగ్రఖణ్డితమణిక్షోణీతలాః కేవలమ్॥

రణసింహుడు : ఆహా ! యేమిశ్లోకం !

బిల్హ : కుమారా, ఇది వినండి.

నాత్మీయం నపరాత్మ్యసత్యవిషయే వ్యాక్షిప్యతే సత్త్వరం
దాక్షిణ్యేన సమీహితే సనవఘో వర్గేపి ధీరాశయః
నిష్ప్రాతః కుటిలేన యేన ధ్వని చరన్నాగపూరాణి ప్రభోః
దుస్సాధ్యా నపి సాధయత్యభిమతా నర్థాన్స సాధ్యానపి॥

రణ : తమవంటి మహాకవులన్ల కృపను పొందడముచేత అమాత్య సంపత్కారుల జన్మ సఫలమైనది. ఆ మహాపురుషుడు అసమాన ప్రతిభావంతుడు, దయాళుడు ప్రభు విశ్వాసపాత్రుడు; మరిన్నీ యీ రాజ్యానికి కాలగతిచేత వలసవచ్చిన మమ్మును కాపాడుతున్న పరమమిత్రుడు. తమ పొగడ్తకు తగినవాడేగాని జైనుడుకాకుంటే యింకా బాగుండును కదాఅని అనుకుంటాను.

బిల్హ : (చిరునవ్వు నవ్వి) ప్రభువు నమ్మినబంటయి, మిమ్మల్ని కాపాడుతున్న మిత్రుడై, లోకోపకారధురీణుడై సప్పుడు ఆయన మతం మీకు యెక్కడ అడ్డువచ్చెను కుమారా ?

రణ : సకలసద్గుణసంపన్నుడుగదా. మతంగూడా మంచిదైతే,

చంద్రుడికి కళంకం లేనట్లు వుండును గదా అని నా మనస్సున కొంత.

బిల్హా : కుమారా, నిజమైన జ్ఞానమును సాధించవలెననే అభిలాషగల మీ బోటి పండితులకు పరమతములయందు అసూయ వుండకూడదు. ఈ భూప్రపంచమందు లెక్కలేని మతాలు వున్నవి. అన్ని పేరెక్కిన మతములలోనూ పండితులూ, సత్పురుషులూ కలరు. అన్ని పేరెక్కిన మతములలోనూ సంసారమును తరించే సాధనములు కలవు. ఆ యా సాధనములను అవలంబించి ప్రాజ్ఞులుధర్మమార్గానువర్తులై, సదా లోకోపకారపారీణులై ఆ యా మతములకు వన్నె తెత్తురు. అందుకు అమాత్య సంపత్కారులే దృష్టాంతము. అప్రాజ్ఞులు ఆత్మలాభమునే అపేక్షించుచు అట్టి లాభము సమకూడుటకు వంకరతోవల నడచి, తామసులై పరులను పీడించుచు జీవిక లేని జపతపాదులను చేయుచు లోకమును, దేవుడినికూడ మభ్యపరుప యత్నింతురు. అట్టివాడు నానా మంత్రి. పేరుగల మతమల్లా సత్ప్రవర్తనను, భూతదయను ముఖ్యములని సాటుతున్నవి. వైదికమతములకన్న బౌద్ధ, జైన మతములలోనే పీటెక్కిప్రాముఖ్యతలావు. సత్ప్రవర్తనఅనేది ఆత్మకు కవచము. భూతదయ అనే ఉపాసన ప్రత్యక్షస్వర్గమై సద్యోఆనందాయకము. నిర్వ్యాజమైన యీగుణములతో మేళనలేని జపతపాదులు వ్యర్థములు. మనస్సుయొక్క దుర్వృత్తులను మళ్ళించడం అల్పబుద్ధులకు సాధ్యంకాదు. ముక్కుబిగించుకు కూచోనుట ప్రతికోంగకూ సాధ్యమే. గాన వైదికుడైన నానామంత్రికన్న, జైనుడైనసంపత్కారులే

శిష్యు. నాలుగు దేశాలుగా తిరిగి నాలుగు దేశాలవారితో చనువూ అన్నదమ్ములనంత బతికినవాళ్ళకు మతాభిమానాలు నశించి పోతాయి. బుద్ధికి సంకెళ్ళు విడిపోతాయి.

రణ : జైనులు వేదబాహ్యులుగదా అని.

బిల్హ : ఆ మాటకువస్తే మన దర్శనాలు అన్నీ వేదప్రామాణ్యము సరిగ్గా చెప్పుతున్నవా? చెప్పుతున్నవి మాత్రం ఒక్కరీతిగా చెప్పుతున్నవా?

రణ : (ఆలోచన నటించి) అవును నిజమేనండి.

బిల్హ : మరి యేలా వేదములనుగూర్చి అభిమానము? అన్ని మతాలవారూ చెప్పేటి శబ్దప్రమాణము ఒక్కటే నాకు కనపడుతున్నది. అందులో ఏకంగా మీ బోటి సందేహులు వుంటారు.

రణ : యే విద్యలోనైనా తమ పాదములవద్ద శుశ్రూష చేసి అభ్యసించడమునకు అర్హుడనుగాని, తమ యెదుట నేను పండితపదవాచ్యుడను యెన్నడూ కానేరను.

బిల్హ : నే చెప్పవచ్చిన సర్వమతసమ్మతమైన శబ్దప్రమాణమనేది ఇట్టిది అని చెప్పడమునకు శక్యముకాని ఆనందమును కలుగజేసే విలాసవతీ సంబంధి శబ్దప్రపంచం. (గాలి గడిమి) ఒకొక్కక్క నెంత్రుక నెగుస్తున్నది గనుక ఆ శబ్దప్రపంచము విషయంలో బధిరత అప్పుడే మమ్ములను ఆవహిస్తున్నది.

రణ : పూర్ణ యౌవనముయొక్క శృంగార రసగ్రహణశక్తి, వార్ధక్యముయొక్క జ్ఞానసంపత్తి, ఆ రెండు అవస్థలకూ సహా

జములైన దోషములు అంటకుండా, మహాకవులయందు సదా కలిగివుంటవి.

హేలాభ్యస్త సమస్త శాస్త్ర గహనః సాహిత్యపాథోనిధి
క్రీడాలోడన పణ్డితః ప్రియతమః శృంగారిణీనామ్ గిరామ్॥

అని కర్ణమహారాజు ఎవరిని గురించి చెప్పగలిగాడు? వస్తుప్రపంచములో, జనసామాన్యమునకు గోచరముకాని రామణీయకమును కనిపెట్టకలిగినవారు కవులే కదా !

భిల్హ : కుమారా, యింత పరిజ్ఞానమూ, గుణసంపత్తీ కల మీరు పండితులు కాకపోతే యింక ఎవరు పండితులు. సత్యమే; స్వర్గనరకము లనేవి యీ లోకంలోనే వున్నవి. చూడనేర్చినవాడికి ప్రతిదేశంలోనూ కలవు; నందనవనాలు, దేవతా స్త్రీలూ, మహర్షులూ. అట్టి భూలోకమందుగల ఆ స్వర్గరామణీయకమును కావ్యములుగా సర్వజనవేద్యము చేసినాడనికదా కాళిదాసును నేను మెచ్చుకుంటాను. ఊర్వశి పురూరవుడి కన్నులు మూయుటకు దొంగతనముగా వెనుకపాటునవచ్చినపుడు ఆమె అందెలయొక్క అణగీ అణగని చడియొక్క సొగసు కవులలోకల్లా కాళిదాసుకదా గ్రహించెను. "గూఢం నూపుర శబ్దమాత్ర మపి మేకాంతం శృతౌ పాతయేత్" కవిత్వంలో ధ్వని అన్నది ఆ అందెల చడిలాగు వుండవలె. చూడండి కుమారా, నేను చెప్పిన శబ్దప్రమాణమును కాళిదాసేగదా నిర్వచనం చేశాడు.

"సామన్తమౌళి మణిరఞ్జితపాదపీఠ
మేకాతపత్ర మవనేర్న తథా ప్రభుత్వమ్,
అస్యా స్సఖే చరణయో ర్వయ మద్య కాన్త
మాజ్ఞాకరత్వ మధిగమ్య యథా కృతార్థాః"

ప్రియురాలి ఆజ్ఞకు చక్రవర్తులు బద్ధులు. ఇతరుల మాట చెప్పనేలా.

*

బిల్హ : అస్యాశ్చర్యమయస్యమన్త్రిగతయః స్వైరంతరంగైరపి।
జ్ఞాయన్తేన విధేరివాతికుటిలా వైదగ్ధ్యసీమా భువః।
శ్రూయన్తే ప్రతిభూభృతాం వసతయః స్వంగత్తురంగావళీ।
విక్షోభ్యక్షితి ఖురాగ్రఖణ్డితమణి క్షోణీతలాః కేవలమ్॥

రణ : ఆహా యేమిశ్లోకం గురూజీ !

బిల్హ : కుమార, ఇది వినండి.

వాత్సల్యం నవహాత్యపత్యవిషయే వ్యాక్షిప్యతేన క్షణం।
దాక్షిణ్యేన సమీహితే నవవధూ వర్గేపి ధీరాశయః।
నిష్ణాతః కుటిలేన యాధ్వని చరన్నాచారపూతః ప్రభోః
దుస్సాధ్యానపి సాధయ త్యభిమతా నర్థాన్సు సాధ్యానపి॥

రణ : మహామాత్య సంపత్కురుడు మీవంటి మహాకవివల్ల కృతిపొందడం; యేమి అదృష్టవంతుడు. మనకు అప్పుడు తమ పొగడ్తకు తగినవాడేగాని జైనుడు కాకుండావుంటే బాగుండును.

---

* ఇది వ్రాతప్రతిలోని రెండవ అంకములోని రంగము : చంద్రవర్మ భవన సామీప్యమున ఉద్యానవనములో కొలనువద్దున కూర్చున్న బిల్హణ రణసింహుల సంభాషణము; దినికి ముందు అచ్చొత్తించిన వ్రాతప్రతిలోని భాగమునకును, దీనికిని స్వల్పభేదము కలదు. యామినిదేవిని రణసింహుడు ప్రేమించినట్లు, అతని ప్రేమభావము యిందుసూచితము. యామినిదేవియందు పొడమిన రణసింహుని ప్రేమ యెట్లు పర్యవసించునో ఊహింపలేము. కాని యీ కథాబీజము నాటకమునకు ప్రధానమువలె కనబడుతున్నది. సంస్కృతి మూలమునలేని కథాకల్పనలను మహాకవి యీ నాటకమున కావించిరి. అట్టి కల్పనలో యిది ముఖ్యమైనది. నాటకమున కిది ఆయువుపట్టు.

బిల : (చిరునవ్వు నవ్వి) కుమారా! సిద్ధాంత జ్ఞానమును సాధించన తెలిసిన్న పండితునికి పరమతములయెడల అసూయ వుండ కూడదు. యీ భూప్రపంచమందు లెక్కలేని మతాలు వున్నవి. అన్ని మతాలలోను ప్రతిభావంతులు, మహాపండితులూ కలరు. మన మతమే నిజమూ, పరమతములన్నీ అబద్ధమూ అనుట అజ్ఞత. యే దేశంలో, యే మతంలో యేమేమి మేలువుంటే అవన్నీ గ్రహించదగినదే. నాలుగు దేశాలూ తిరిగి నాలుగు మతాలవాళ్ళతోనూ అన్నదమ్ముల్లాగ బతికినవాళ్ళకి మతాభిమానాలు మాసిపోతాయి. బుద్ధికి సంకెళ్ళు విడిపోతాయి. వైదిక మతావలంబియై రోజూ రెండుఝాములు మఠం వేసి జపతపాలు చేసే నానామంత్రి ప్రవర్తనకూ, జైనుడై వేదబాహ్యుడైన సంపత్కుమారుడి ప్రవర్తనకూ కల భేదము చూస్తివిగదా! నానామంత్రి తనకు తెలుసునని గర్వించే ఆ భగవద్గీతలోనే పదహారవ అధ్యాయంలో దేవప్రకృతి, రాక్షసప్రకృతి వర్ణింపబడియున్నవి. అందులో వైదికుడైన నానామంత్రియందు ఆసురరాక్షస గుణములు మూర్తీభవించివున్నవి. జైనుడైన సంపత్కుమారుడియందు దేవగుణాలు వున్నవి. గీతలోకల్లా విలక్షణమైన శ్లోకాలు ఆ అధ్యాయంలో వున్నాయి. అవి మనసును పట్టినవాడు తన్నూ, లోకాన్నీ కూడా జయిస్తాడు.

రణ : అయితే వేదములు ప్రమాణములు కావా?

బిల్హ : మన దర్శనములు మాత్రం అన్నీ వేదప్రమాణం అంగీకరించాయా, వక్రరీతిని అంగీకరించాయా. అన్ని మతాలూ చెప్పుకునే శబ్దప్రమాణము నాకు ఒక్కటే కనబడుతున్నది.

రణ : ఏమిటండి అది.

బిల్హ : యౌవ్వనులైన మీరెరుగరా, కుమారా ?

రణ : పోల్చలేకుండావున్నాను.

బిల్హ : విలాసరతులతో సంబంధించిన శబ్దజాలం. ఆ శబ్ద ప్రమాణం సృష్ట్యాదినుండి అన్ని మతాలవారూ శిరసా వహించుకుంటున్నారు. ఆ ప్రమాణంయొక్క బలం నిన్నటి రోజునే నాకు వ్యక్తమయింది.

రణ : (అయిష్టమును ముఖమున కనపర్చి తరువాత చిరునవ్వు నవ్వును.)

బిల్హ : కుమారా! గురువుమీద శిష్యులకు అలకపాడమిందా? ఏమి యీ బ్రాహ్మణు మహారాజ కుమారికల శృంగారంవిష యమును ప్రలాపంచేస్తున్నాడా అని కావచ్చును. తరవాత, ఇంతపండితుడు * అయినాడా అని నవ్వువచ్చినదా? అయితే బిల్హణుడు కవి శేఖరు డన్నమాట మరచితిరి కుమారా! కవి అంటే యెవడు. వస్తుప్రపంచమునందుయితరులుచూడలేని సొగసులు చూసేవాడు. యితరులకు ఆవేద్యమైన రసమును అనుభవించేవాడు. కాళిదాసును యీ విషయంలో యెంతైనా మెచ్చవలసివున్న ది. ప్రియురాలు, దొంగతనంగా ప్రియుడి వెనకపాటున కనుమూయుటకు వచ్చేటపుడు, ఆమె అందెలయొక్క అణగిఅణగిన చడిసొగసు కవుల్లోకల్లా అతనే గ్రహించాడు ! గూఢం నూపుర శబ్దమాత్ర మపి మేకాంత వచోపాతయేత్.

---

* ఇచ్చట వ్రాతప్రతిలో యే శబ్దము ప్రయోగింపబడలేదు. ఓట్టి ఖాళీజాగా వదలిపేయబడినది.

కవిత్వంలో ధ్వని అ అందించవలెనా వుండాలి. ప్రయురాలి
శబ్దప్రామాణ్యం మళ్ళీ కాళిదాసు చెప్పాడు.

సామస్త పాలి మణికల్పితపాదపీఠ
మేకాతపత్రమవనేర్న తథా ప్రభుత్వమ్
అస్యాస్సఖే చరణయో రహ మస్మ కాస్త
మాజ్ఞాకరత్వ మధిగమ్య యథా కృతార్థః.

పాదముయొక్క అజ్ఞాకరుడు కావడం సామ్రాజ్యంకన్నా గొప్ప
పదవి అన్నాడు. ఒక్కొక్క విలాసినియొక్క వాక్కులయందు
ఈశ్వరుడు అనిర్వచనీయమైన రామణీయకత ఉంచాడు.
వెనుక 13క మా దేశంలో ఒక దరిద్రశేప స్త్రీని చూచాను.
దాని మాటలు విని విని చెవికి మస్తక్కి అ స్థలంనుంచి లేచి
రావడం కష్టమైంది. మహారాజ కుమారి కావారి వాగ్మాధు
ర్యము, అ మాధుర్యమును సెయ్యిరెట్లు మించియున్నది.
అదుగో మళ్ళీ కుమారా ! జోమ ముడి పడ్డది. రాజపుత్రికల
యొక్క రమ్యతను మెన్నటకు యీ గ్రామ్యాడి తల తగునా
అనికదూ. సంతోషమే. పైకి అండమేకదూ చెప్పా,
మాటలయొక్క మంజులత విని చెవి ఆనందించినది.
ఆనందించినది అని పైకి అనడంలో నాతప్పు యేమి; చంద్ర
మండలము ఆకాశమందు వున్నది. దాని కాంతికి కళ్ళు
మూసుకొమ్మంటే యెచడిశక్యము. కానీ పదిహేను రోజు
లాయె నేను గీత చెబుతున్నాను. ఇన్నాళ్ళూ వారు మౌన
మవలంబించారు. నిన్ననే మాటాడారు. వారు మాటాడ
గానే అ మాటలయొక్క, ఆనందంయొక్క భావము,
వేదాంతశాస్త్రవేద్యమైన శబ్దజాలములో కప్పబడి యెక్కడా

కానరానప్పటికీ యెప్పుడో లభ్యమౌతుందని, యీ జన్మమట్టుకు వృథాఅని అట్లు బ్రహ్మానందముయొక్క అభావము కనపడి ఆహా యెందుకు యీ పుస్తకాలు? ఇవి వున్నాయనే ఆనందం యెక్కడా కనపడదు. ఈమె మాటలు వినడమే బ్రహ్మానందం. ఈమె వాక్కులయందే అత్యంతమైన శబ్దప్రమాణము అని నిశ్చయించాను.

రణ : మీ కల్పనాచాతురికి సంతోషించాను.

బిల్హ : యేమి కల్పనాచాతురి. ఆ వాఙ్మాధురి వర్ణన శబ్దముకు పట్టుపడనిదే. అభూతోపమ.

రణ : వారిని చూస్తిరా!

బిల్హ : చూడలేదు. చూడడమేలా? దేవుణ్ణిచూస్తున్నామా? వాడి మహిమ ప్రపంచమంతటనూ చూసి అత్యాశ్చర్యపడుతున్నాముకామా? మనిషిని చూడకుండా మాటలవల్ల సమ్మోహామును పొందుతూవుండుటలో ఒక అనిర్వచనీయమయిన సొగసు వున్నది. మరివక చమత్కారము చెబుతాను. తరుచు స్త్రీవ్యక్తులలో అంగమునకు అనురూపమైన అంగసౌష్టవము ఉండుట కష్టము. స్త్రీనడుచుకుపోతూవుంటే, ఆ నడకా, అంగములూ అతి రమ్యముగా కనపడుతాయి. ముఖం చూస్తే జాదూ విరిగిపోతుంది. కనక దేవుణ్ణి చూడకుండా సృష్టివైచిత్రిని చూచి ఆనందించినట్టే ఆమెను చూడకుండా ఆమె మాటలలో మగ్నమైపోవడం మాబోటి కవులకు బ్రహ్మానందము.

రణ : (నిస్పృహను సూచించి, విచారరసముకల నవ్వునవ్వి) వాఙ్మాధురిని మీరిన రూపసౌందర్యము ఆమెకు కలదు.

బిల్హ : * కుమారీ! మీరెలా చూస్తిరి.

రణ : ఒకనాడు మదనపాలుల కుమార్తె చంద్రలేఖా, మహా రాజపుత్రికయును యీ వనము చూచుటకు వచ్చియుండిరి. నేను వారి రాక చూచి ఒక పంజరమున దాగుంటిని. చెలి కత్తెలు పొదనుండి పొదకు వేటాడి పట్టుకొని ఆమెయెదట వుంచిరి. ఆమె తమ తల్లిగారికి నన్ను కనపర్చినారు. వారుకూడా దయ కనపర్చినారు. అప్పటినుండి కమల ములుకోసి తీసుకుపోవాజ్ఞ ఆయెను. అట్లు నెలరోజులు తీసుకువెళ్లితిని. మాధవశర్మగారు దగ్గరవుండగా నేను వెళ్ళుటకలదు. ఆమె పాఠములు చదువునప్పుడు దగ్గర వుండేవాడను. శ్లోకములు రచించేవాళ్ళము. ఇలా నెల రోజులు అయినతరువాత మాతాతగారు వచ్చిన్నారు. † మరి నేను వెళ్ళలేదు. యీ వనంలో వారు విహరించడం తరుచుకద్దు. అట్టిసమయంలో నేను యీ యింట్లోవచ్చి దాగొనమని ఆజ్ఞ.

బిల్హ : ఆమె పెద్దపులికాదే! నాకు బోధపడ్డది. మీ మనస్సు ఆమెయందు లగ్నమాయెను, కాబోలు. యిప్పటి అవ స్థనుబట్టి మీ ప్రేమను రాజకుటుంబమువారు నిరాకరిం చిన అవమానము వచ్చునని కాబోలు.

---

* ఈ వాక్యము ముందు ఒక వాక్యము వ్రాయబడి కొట్టివేయబడ్డది, ఆ వాక్యము యిది. "అట్లాగైతే అంతకన్న చూడకూడదు."

† ఇక్కడ వ్రాతప్రతిలో వ్రాసి కొట్టివేయబడ్డ వాక్యములు, "వెళ్ళ డంమానితిని. నన్ను కాశ్మీరం పంపితిమని మాతాతగారు వప్పుకొంనచేశారు."

# * నాటక కథా విభాగము

బిల్హణుఁడు యిక తాను తానుకానని యీ రంగమున వ్యక్తపరచును. చూపులు చెదరునట్లు కనులముందు వొక జగన్మోహనావతారము తారసిల్లినపుడు, యెట్టి పురుషవ్యక్తికైనను నిగ్రహించుకొనుట, యెట్లు పొసగును? విష్ణువు, జగన్మోహినీరూపము దాల్చి యెదట అవుపించేసరికి జితేంద్రియుడైన శివుని ధైర్యము సడలినదికాదా!

నాయిక, రాజులను గురించి బిల్హణుని అడుగును. బిల్హణుడు, రణసింహుని పేరు చెప్పకుండా, ఆమె చెంత అతని ప్రసక్తి తెచ్చును. "రాజులను పరిణయమాడుటవల్ల స్త్రీలకు ఘనతవచ్చేమాట నిజమే; గాని ఆనందము మటుకు కలుగ నేరదు, సాధారణంగా రాజులకు ఎంతోమంది సపత్నులూ, ఉంపుడుకత్తెలూ వుంటారు. రాజపత్ని అగుటవల్ల వచ్చే గొప్ప, కలిగే ఉన్నతస్థితీ మిక్కుటమే; అయితే సౌఖ్యమన్నది మాత్రం కొరవడుతుంది. గొప్పతనాన్ని మనం కొరుక్కుతింటామా?"

ఆమె : అది బ్రాహ్మణుల దృష్టి.

బిల్హ : ఇది సవబయిన తార్కికదృష్టి. కొందరు రాజకుటుంబికులు కొంతకాలం యేలుబడిచేస్తారు. మరికొంతకాలా

---

* ఇది యే అంకమో, యే రంగమో తెలియదుకాని మహాకవి వ్రాయ తలపెట్టినకథాభాగం. తాము నాటకీయముగ రచించుటకుముందు, మహాకవి, ఆంగ్లమున వ్రాసి అట్టే పెట్టుకున్న కథావృత్తాంతమిది. దీనిని నాటకరంగములుగ తీర్చిదిద్దిరో, లేదో, మరి అలాగ రచించివుంచిన వ్రాతప్రతులు పోయినవేమో మనకు తెలియదు.

నకు రాజ్యాలను పోగొట్టుకుంటారు. గాని కుటుంబాల ఉద్ధతీ పతనమూ రెండూ సహజమైనవే. రాజ్యంపోగొట్టు కున్నపుడు వచ్చే దుఃఖం అతిభారమైనది. ఈ దుఃఖాన్ని మీరు ఆపుకోవలెగదా! సుఖాలు మనుష్యులకే సుఖం లావు. సామ్రాజ్యభారం మీదపడకుండా వొత్తిగిలివుంటూ గుణసంపన్నుడూ, ప్రాజ్ఞుడూ అయిన యువకుడు ప్రేమాస్పదుడు. అన్నింటినీ మించిన పవిత్రమైన నిండు ప్రేమ హృదయంగల రాజకుమారుని ప్రేమించటం శ్రేష్ఠము.

ఆమె : అలాంటి రాజపుత్రుడు నిజంగా వున్నాడా?

బిల్హ : ఆఁ! వున్నాడు.

ఆమె : యెక్కడ?

బిల్హ : చెప్పనందుకు మన్నించండి.

"శ్రోత్రోపాసన" యిత్యాది శ్లోకములను పఠిస్తూ బిల్హణుడు మాటలు మరిపిస్తాడు.

రణసింహుని ప్రసక్తి మాటిమాటికీ తెచ్చిపెడుతూ వుంటే ఆమె 'అతను యెవరని' రెట్టించి రెట్టించి అడుగుతూ వుంటుంది.

తన ఆత్మోపశమనమునకై రాచనగరు వొదిలి, బిల్హణుడు వెళ్ళిపోవును. ఇపుడు అతను మధురాసవమునకు బాగా అలవాటుపడ్డాడు. రాజకుమారికతో మనసువిప్పి ప్రసంగిస్తాడు. బిల్హణుడు నగరువదలి వెళ్లిపోతున్నాడన్న వర్తమానము తెలిసి రణసింహుడు తన పరిజనులను వెంటతీసుకొని దారిలో అతనిని

కలుస్తాడు. దారిమధ్య సోమనాథ్‌వద్ద కవినీ, అతనిబృందమునూ దుండగులు అడ్డగిస్తారు. నాయకుడు రణసింహుడు వారిని తరిమివేసి బిల్హణుని కాపాడతాడు. బిల్హణుడు సముద్రంపై ప్రయాణంచేసి వెళ్లిపోతాడు.

వెళ్లిపోతూ బిల్హణుడు వొక ఉత్తరము నాయికకు రాసి రణసింహునిచేతికి యిస్తాడు. కలత నిదురనుంచి తను లేచి వెళ్ళిపోతున్నాననీ, ఆమె ప్రేమను తాను స్వీకరించ జాలననీ, తాను ఆమెచెంత యిన్నాళ్ళూ చెబుతూవస్తోన్న రాజకుమారిని ప్రేమించమనీ, ఆ రాజకుమారుడు మరెవడో కాదనీ, అతనే రణసింహుడనీ యామినీదేవికి బిల్హణుని లేఖ.



